# శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము

వృశ్చికే కృత్తికాజాతం చతుష్కవి శిఖామణిమ్ ।
షట్ప్రబంధకృతం శార్ఙ్గమూర్తిం కలిహమాశ్రయే ॥





గ్రంథకర్త

**శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులు**

ప్రచురణకర్త

నల్లూరి వేంకట సీతారామాచార్యులు

ఓమ్ శ్రియైనమః

# శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము

( శ్రీహరినామ కీర్తనలు - ఎదురుకోల రాయబారసహితము)




గ్రంథకర్త

శ్రీ భావనారాయణస్వామి పాదపద్మారాధకులు - ఆస్థాన పండితులు

"శ్రీ ఆగమాచార్య, శిల్పరత్న, కవీశ్వర, పౌరాణికశేఖర,"

శ్రీమాన్ పణ్డిత నల్లూరి రంగాచార్యులు

ప్రచురణకర్త

గౌతములు

"వైఖానసాగమవాచస్పతి, వైఖానసరత్నాకర, ఆర్షవిద్యాభూషణ,"

నల్లూరి వేంకట సీతారామాచార్యులు

గ్రంథకర్త పౌత్రుడు

బాపట్ల

శ్రీముఖ శ్రావణ పూర్ణిమ 2-8-1993

ప్రతులు వెయి



ప్రతులకు :

డాక్టరు నల్లూరి వేంకట సీతారామాచార్యులు ఫోను నెం. 4694

శ్రీ భావనారాయణస్వామివారి ఆలయ ప్రధానార్చకులు-స్థానాచార్యులు

10-3-10 మహాత్మాగాంధిరోడ్డు బాపట్ల 522 101 గుం.జి.ఆం.ప్ర.



ఈ గ్రంథము శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానములవారి
ఆర్థిక సహాయముతో ప్రచురించబడినది



శ్రీ భావనారాయణ స్వామి వారు క్షీరవృక్షమునుండి చోళరాజునకు దర్శనమొసగుట

ఫాల్గుణేచోత్తరఫల్గుణ్యాం పూర్ణిమా భానువాసరే।
మీనే క్షీర ద్రుమ వ్యక్తం భావదేవ మహంభజే॥

# ప్రార్థన

ఒకనాటి బ్రహ్మారణ్యమున క్షీరవృక్షమునందుద్భూతులైన పరమాత్మ శ్రీ క్రిమి కంఠ చోళమహారాజుయొక్క గజసమూహమును రక్షించి దర్శనమివ్వగా రాజు శా॥శ॥ 516 లో గజ పాదాకృతి గలశిల స్తంభముల ఆలయమునందు స్వయం వ్యక్త అర్చామూర్తిగా శ్రీ స్వామికి స్వస్తిశ్రీ ప్రమాదీచ నామ సంవత్సరమున మీన సంక్రమణయుక్త ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ ఆదివారమునాడు (క్రీ॥శ॥ 594లో) శ్రీ వైఖానస శ్రేష్ఠులు గౌతమ గోత్రోద్భవులు పండితులు పరమవైదిక నిష్ఠాగరిష్ఠులైన శ్రీమాన్ చంద్రగిరి వెంకనాచార్యులవారిచే ప్రతిష్ఠ జరిపించెను. నాటినుండి నేటివరకు భావపట్లలో (బాపట్ల) భక్తజన రక్షణ గావించుచున్న శ్రీ భావనారాయణస్వామివారి చరిత్ర జగత్ప్రసిద్ధి నందిన విషయము సర్వజన విదితమే.

శ్రీవారి పాదపద్మారాధన గావించుచు మా తాతగారైన శ్రీమాన్ రంగాచార్యులవారు 1. స్థల ప్రభావము, 2. అర్చావతార వైభవము 3. తిరుమంగయాళ్వారు చరిత్రము 4. శ్రీహరినామ కీర్తనలు 5. ఎదురుకోల రాయబారము, అను 5 గ్రంథములను రచించి బాపట్ల శ్రీ భావదేవునకు అంకితముగావించి చరితార్థులైరి.



శ్రీ రాజ్యలక్ష్మి తాయారు ప్రతిష్ఠ 594 శ్రీ భావనారాయణస్వామి

గ్రంథకర్త - వారి ధర్మపత్ని

ప్రకాశకుల పితామహులు





శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు
1852 - 1928 బాపట్ల

శ్రీమతి రత్నమ్మగారు
1858-1923

వారి రచనలు అందుబాటులో లేకుండా పోయినందున లోగా నేను మా అన్నగారగు శ్రీమాన్ వేంకటరంగాచార్యులుగారు కలసి గౌతమ సోదరులుగా మా తాతగారి మొదటి రెండు గ్రంథములను ప్రచురించి క్రీ॥శ॥ 1964 లో భక్తులకందజేసియుంటిమి. వీటితో పాటు శ్రీభావదేవ సుప్రభాతమును శ్రీ రాజ్యలక్ష్మీ భావదేవుల అష్టోత్తర శతనామ స్తోత్రములను "భక్తకవి" "అభినవపోతన" బిరుదాంకితులైన నల్గొండ జిల్లా కోదాడ తాలూకా తమ్మర గ్రామ వాస్తవ్యులైన శ్రీమాన్ తమ్మర గోపాలాచార్యులగారిచే రచింపబడిన పద్యావళిని, "దివ్యస్తుతి" అను గ్రంథములనుకూడా శ్రీభావ దేవాంకితముగా ప్రచురించి అందజేసియుంటిమి.

నేడు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల ఆర్థిక సహాయముతో మా తాతగారి రచనలైన శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము, శ్రీహరినామకీర్తనలను, ఎదురుకోల రాయబారములనుకలిపి భక్తజనులకందించు భాగ్యము నందించిన శ్రీనివాసమూర్తిని మనసారా ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమును పరిశీలించి తమ అమూల్య అభిప్రాయములనొసగి ఆశీర్వాదములందించిన మహనీయులకు నాశతాధివందనములర్పించుచున్నాను.

బాపట్ల శ్రీ లక్ష్మీ ప్రెస్ అధినేతలు శ్రీ గుంటుపల్లి వీరయ్యగారు శ్రద్ధ వహించి సర్వాంగ సుందరముగా ముద్రించి అందించినందులకు వారికి నా కృతజ్ఞతాభివందనములు

ఆసక్తి కలవాడనేగాని శక్తి కలవాడనుగాను. సహృదయులు సరసులు నగు పలువురు నాప్రయత్నమునకు ప్రోత్సాహమిచ్చిన పెద్దలందరికి నా ధన్యవాదములు. శ్రీభావనారాయణస్వామివారికి కృతి సమర్పించుచు ఇట్టి భక్తి రస గ్రంథములను భక్తులకందజేయు భాగ్యమును ప్రసాదించవలసినదిగా మా కులదైవమైన శ్రీ భావదేవుని మనసారా ప్రార్థించుచున్నాను.

ఇట్లు

ప్రకాశకులు గ్రంథకర్త పాత్రులు - గౌతములు

**నల్లూరి వేంకట సీతారామాచార్యులు**

**బాపట్ల.**

గ్రంథకర్తగారి కోడలు - కుమారుడు
ప్రకాశకుల తల్లిదండ్రులు





శ్రీమతి వల్లూరి రాఘవమ్మగారు 1889 - 1951

శ్రీమాన్ వేంకట్రామాచార్యులుగారు 1882 - 1956

గ్రంథకర్తగారి జ్యేష్ఠ పౌత్రులు
ప్రకాశకుల వదినెగారు - అన్నగార్లు



శ్రీమతి నల్లూరి వేంకట లక్ష్మాయమ్మ 1913 - 1988

శ్రీ వేంకట రంగాచార్యులుగార్లు 1909 - 1981

ప్రకాశకుల - మేనమామలు



శ్రీమతి నారాయణం రంగనాయకమ్మ వేంకటాచార్యులుగార్లు
పొన్నూరు శ్రీ భావనారాయణస్వామివారి పాదపద్మారాధకులు
సంగంజాగర్లమూడి - తెనాలితాలూకా గుంటూరు జిల్లా

ప్రకాశకుల - అత్తమామలు



శ్రీమతి వేదగిరి సీతారామమ్మ కోదండ రామాచార్యులుగార్లు
శ్రీ చెన్నకేశవస్వామివారి పాదపద్మారాధకులు
కలికివాయి బిట్రగుంట కందుకూరుతాలూకా ప్రకాశం జిల్లా



## శ్రీ గౌతమ మహర్షి

### విషయ సూచిక



### అభిప్రాయ వేదిక

| | | |
|---|---|---|
| ప్రశంస | సర్వశ్రీ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులుగారు | అప్పికట్ల |
| రత్నత్రయము | దీవి కృష్ణస్వామి అయ్యంగార్ | నల్లూరు |
| భగవదారాధనము | ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు | బాపట్ల |
| చల్లని పలుకులు | నరహరి గోపాలాచార్యులు | తమ్మర |
| నవజీవన | బృందావనం రంగాచార్యులు | పరుచూరు |
| శ్రీరంగ పంచకము | కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి | గుంటూరు |
| సత్కృషి | మురికిపూడి వెంకటనరసింహాచార్యులు | బొప్పూడి |
| ఆనందదాయకము | దీవి విఖనసాచార్యులు | తిరుమల |
| మహోపకారము | పలేశ్వరపు నరసింహారావు | బాపట్ల |
| ప్రశంస | నందిగలుగు వెంకటేశ్వరశర్మ | మైలవరం |
| అభినందన | పెద్దింటి సూర్యనారాయణదీక్షితదాసు | నర్సాపురం |
| భావన | రాంపిచర్ల శ్రీనివాసాచార్యులు | పాతరెడ్డిపాలెం |

| | | |
|---|---|---|
| అమృతధారలు | సర్వశ్రీ ఆగమభాస్కర H A. కేశవాచార్యులు | బెంగుళూరు |
| ధన్యులు | ఎస్.ఎ.కె. శ్రీనివాసాచార్యులు | తిరుపతి |
| నాలుగుమాటలు | అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు | నరసాపురం |
| మహాపురుషులు | నారాయణం శ్రీనివాసాచార్యులు | సంగంజాగర్లమూడి |
| ఆమోదము | పణ్డిత పెద్దింటి లక్ష్మీనరసింహాచార్యులు | అంతర్వేది |
| దివ్యానుభూతి | నల్లూరి విఖనసభట్టాచార్యులు | నల్లూరు |
| మహనీయులు | గంజాం రాఘవాచార్యులు | వంగోలు |
| పుణ్యవిశేషము | వంగీపురం రామాచార్యులు | బాపట |
| హృదయాహ్లాదము | మాతాజీ త్యాగీశానందపురి | బాపట్ల |
| భావపుష్టి | ములుకుట్ల సదాశివశాస్త్రి | తెనాలి |
| హరినామ సంకీర్తన సుధ | బృందావనం వెంకట రమణాచార్యులు | నిమ్మకూరు |
| మనోహరము | బ్రహ్మశ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి | హైదరాబాదు |
| ఆకాంక్ష | నారాయణం సత్యనారాయణాచార్యులు | వలంగిమాన్ |
| సంతోషదాయకం | పెద్దింటి రంగనాథము | అమరావతి |
| త్రివేణి | ప్రతాప సుబ్రమణ్యశాస్త్రి | చీరాల |
| ఆనందభాషణము | ఇలపావులూరి కామేశ్వరరావు | నెల్లూరు |
| విశ్వాసము | కే. యి. టి. రామానుజాచార్యులు | బాపట |
| చంద్రునకొక నూలుపోగు | నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు | విజయవాడ |
| అభిప్రాయము | శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం | బాపట |
| విన్నపము | గుండు వెంకట జ్ఞానానరసింహశాస్త్రి | బాపట్ల |
| అభిహారకము | పణ్డిత వేదాంతం పార్థసారథిభట్టాచార్యులు | తెనాలి |
| అభివందనము | అర్చకం రామస్వామి దీక్షితులు | తిరుపతి |

ఓం

శ్రీయైనమః

శ్రీ శ్రీనివాసాయ నమః

# శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము

కం॥ శ్రీరాజ్యలక్ష్మితోడుత
గౌరవమునగూడి వేడ్కగడలు కొనంగా
కూరిమి బాపట్ల పురిన్
ధీరత నెలకొన్న భావదేవుని దలతున్॥ 1

కం॥ ధరనెల్ల విఘ్నములు సు
స్థిరమతిదొలగించి హరికి సేనాపతియై
బరగెడు విష్వక్సేనుని
నిరతము స్మరియింతు కావ్యనిపుణత వెలయన్॥ 2

గీ॥ దైవికాగమశాస్త్ర సిద్ధాంతమాది
సుమహితంబగు విఖనససూత్రమెల్ల
ఘనత రచియించి పెంపొంద గనినయట్టి
విఖనసాచార్యవర్యుని వినుతిజేతు॥ 3

కం॥ ధర విఖనససత్కులమున
వర శ్రీ నల్లూరివంశ వర్ధనుడగుచున్
తిరువేంగళయాచార్యులు
సురుచిరగుణ సముదయమ్ము శోభిలుచుండన్॥ 4

కం॥ ఆయనకు సుతుడు వెంక
టార్యయాచార్యులు జనించి రహిబెంపొందన్
శ్రీయుతుడై సత్కీర్తిని
బాయక తా జానకమను బరిణయమయ్యెన్॥ 5

కం॥ ధరవారికి బ్రియతనయుడ
వర రంగాచార్యులనగ బరగినవాడన్
సురుచిరమగు నీ చరితము
స్థిరమతి నర్పింతు భావదేవుని కెలమిన్॥ 6



శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము

## కథా ప్రారంభము

కం॥ ధర చోళదేశమందలి
తిరుకరయను పురమునందు ధీరత వెలసెన్
హరి శార్ఙ్గాంశంబున నర
వరుడగు నీలుండు మ్లేచ్ఛవంశజుడగుచున్॥ 6

వ॥ ఇటులొప్పి యనివార్యశౌర్య గాంభీర్య ధైర్యధుర్యుండై యుద్దండ
భుజాదండ మండితగదాదండుడై దండధరుండుబోలె రిపుమండలం
బులన్ దండించుచు దండిమగండయి విహరించుచుండ. 7

గీ॥ అట్టినీలుని శౌర్యసాహస గుణంబు
లెల్లవిని చోళభూమీశుడుల్లమలర
భటులచే వానిరావించి పటురయమున
మిగుల సన్మానమొనరించి నగణితముగ
కలిహంతుండను నామంబు ఘనతనొసగి॥ 8

కం॥ ఈవిధముగ గౌరవమటు
గావించియు ప్రీతికొన్ని గ్రామంబులు దన్
సేవించునటుల నొసగిన
శ్రీ విలసిల్లంగ నతడు జెలగుచునుండెన్॥ 9

వ॥ అంతట

సీ॥ దివ్యాప్సరసలంత దివినుండి వెడలిరి
వనవిహారము సల్పువాంఛతోడ
శృంగారవనిజేరి పొంగుచు విహరింప
నయ్యెడ ఘనపనస సాష్లబిల్వ
జాలరసాలహింతాల తమాలత
క్రోల చందన నారికేళ వకుళ
పారిజాతాశోక బహువిధ తరువులు
మల్లె సంపెంగ జాజిమొల్లలతలు

గీ॥ అల్లిబిల్లిగ కొల్లగ నల్లుకొనిన
పూపొదలనెల్ల విహరించి పుష్పచయము
లెల్లగొని వెదజల్లుచు నుల్లమలర
వన విహారము సల్పిరి వాంఛదీర॥ 10

గీ॥ కొంతవడి వారలట విరిబంతులాడి
సంతసము మీర జలకేళి సలుపబూని
వంతుకెక్కిన నౌక సరోవరముగాంచి
పంతములమీరనందున పారలీల॥ 11

వ॥ ఇవ్విధంబున నక్కమలాకరంబున్ బ్రవేశించిగేల నవలీల సారసంబులన్ గోయుచు పుప్పొడిదుమారంబు లెగయన్ జిమ్ముచు వళులన్ దోలుచు హంసచక్రబక క్రౌంచంబులన్ బట్టన్ బోవుచు పాదజంఘోరు కటియు రోజంబులు మునుంగునటులన్ గ్రమంబులనీదుచు జల్లులన్ బోరాడుచు నిట్లనేక విధంబులన్ లీలావిహారంబుసల్పి యాసరోవరంబు నిర్గమించి సైకత ప్రదేశంబుజేరి జిలుగుపావడలన్ ధరించి కంచుకంబులు దొడగి చెన్నుమీర పొన్నగున్నల నీడల నజ్జలకేళివిహార శ్రమంబుదీర విశ్రమించియుండ వారల

లోనన్ గుముదవల్లి గాఢ సుషుప్తినుండన్ దోడి చేడియలెల్ల నచ్చోటువాసి వెడలన్దలంచి యా సుదతిన్గాంచి నిద్రాభంగంబొనరింపన్ శంకించి యా సుందరిన్ విడచి తమ తమ నిలయంబుల కరిగిరి. అనంతరంబు గొంత దడవునా కుముదవల్లి మేల్కాంచి వనంబున వారలగలయన్ వెదకి యెచ్చో టన్గానక మిగుల దుఃఖించుచు దైవమున్దూరుచు బహువిధంబులన్ బ్రలా పించుచు కటకటన్ బడుచు నేమియున్ దోచక నొంటిన్ దిరుగుచుండ నంత దైవ వశంబున స్నానార్థంబొక భూసురాగ్రగణ్యుండచటి కరుదెంచినన్గాంచి యా కుముదవల్లి పెన్నిధిన్గన్న పేదచందంబున నద్ధరామరుని పాదంబుల పయింబడి విలంపించుచున్న నా సరోజాక్షిన్జూచి యబ్భూమీశుండిట్లనియె॥ 12

గీ॥ తల్లి నీవు యొంటిదాన విచ్చోటను
నెందుకిటుల దుఃఖమొందెదమ్మ
వేగదెల్పు నీదు వృత్తాంతమెల్లను
జాగుసేయనేల జలజనేత్రి॥

వ॥ అని యడిగిన నబ్భూసురునకు కుముదవల్లి యిట్లనియె॥ 14

కం॥ ఏనును మత్సఖియలు ని
క్కానన భూమికి విహారకాంక్షలతోడన్
మానుగ నిట కరుదెంచి, సు
గానంబులు సల్పి వేడ్కఁగావించి తగన్॥ 15

ఉ॥ అంతట నేను నట్టుల విహారము సల్పియు విశ్రమింప నా
యింతులు నన్నిటన్విడచి యేగిన వారలగానకే నిటన్
జింతులుచుంటి దైవమిటు శీఘ్రము మిమ్మిటు దోడితెచ్చె నా
వంతయు దీరె పుత్రివలె వత్సలతన్ నన్నుబ్రోవు మిత్తరిన్॥ 16

గీ॥ అనుచు బ్రార్థనసేయగ నాద్విజుండు
అమ్మ నీకిక వెరపేలనమ్మ నాకు
ప్రియతనూజవుగా నిన్ను బెంపొనర్తు
ననుచు నాసతిగొని గృహమునకు వచ్చి॥ 17

వ॥ ఇట్లు దనమందిరమునకున్ గొనితెచ్చి ప్రియకళత్రమున కొప్పించి బుత్రి రీతిన్ బెంపొనరింపుమని జెప్పిపుచ్చిన నా సాధ్వీతిలకం బత్యంత సంతసంబు

నన్ బోషింప దినదిన ప్రవర్ధమానయై యక్కన్నియ యొక్కనాడప్పురో
ద్యానవనంబునకున్ జని యేకతంబ వనవిహారము సల్పుచుండ విధివశంబున
నీలుండమ్మార్గంబున నయ్యుద్యాన వనంబు దరియంజొచ్చి యచ్చోనన్నారీ
మణిన్గాంచి క్రొక్కారు మెరుంగను నందియంబొంది శంకించి మందగమ
నంబునన్ జని యా సుందరింగని దాని సౌందర్యాతిశయంబులకు డెందం
బున నమందానందంబునొంది మదనుండదయుండయి కదిసి వదలక భిన్న
హృదయుంగావించిన నతండుల్లము పల్లవింప మెల్లన నప్పల్లవాధరి నల్లన
జేరి యిట్లనియె॥ 18

కం॥ కలికీ నీ పేరెయ్యది
పౌలుపుగ నీవుండునట్టి పురమెయ్యది నీ
తలిదండ్రులెవ్వరు నిజముగ
దెలుపుము నాతోడ నిప్పుడు తేటపడంగన్॥ 19

కం॥ అని పలికిన యా నీలుని
గనుగొని తానిట్లనియె కడురభసమునన్
ఘనుడగు భూసుర తనయను
వినునామము కుముదవల్లి విశ్రుతమొప్పన్॥ 20

వ॥ అనిన నీలుండు మదనబాణ పీడితుండయి యిట్లనియె॥ 21

మ॥ సుందరాంగిరో నిన్ను వేడుక జూచినంతటనుండి నా
డెందమందున నీదు రూపముడిందియుండె లతాంగి యా
నందు గన్గొని మారుడున్ విరిసాయకంబుల నొంచె నీ
పొందుగోరితి ప్రేమ నన్నిటు బ్రోవవే మది సత్కృపన్॥ 22

మత్తకోకిల॥ ఓరి! నీవిటు బల్కఁజాడియె వావివర్తన మెరుంగకన్
మేరమీరిటు కండకావ్వన మేది నీసుర కన్యకన్
గోర నీతియె నొంటిగన్ గొని క్రూరకర్మడ యింకిటన్
జేరరాకుర! దుష్టచిత్తుడ! శీఘ్ర మవ్వలికేగుమా॥ 23

వ॥ అనిన యంత నిలువక నీలుండిట్లనియె॥ 24

సీ॥ సఖియ నీముఖముతో సరిరాక చంద్రుండు
ఘనమార్గమునకేగి కళలుదప్పె
నీరజగంధి నీనేత్ర యుగ్మమునకు
సరిరాక జలజముల్ సరసిజేరె
కంబుకంధరి నీదు గమనముకెనగాక
గజ బృందములుజనె గహనములకు
ఘనలతాంగిరొ నీదు కౌదీగెకెనగాక
సింగంబు లెల్లమజేరె గుహల

గీ॥ నీదులావణ్య మిటుగాంచి నేను
మదనతాపమునకిక క్షణమైన తాళజాల
మోహనాంగిరొ నినుజూడ నహహ యెట్లు
బ్రహ్మకయినను నిలువంగనోపనగునె॥

కం॥ అని యిట్లు బలుకు నీలుని
గనుగొని యా కుముదవల్లి కడురభసమునన్
విను నీచః ఇటుల బలుకుట
ఘనమాః మును వినమె యట్టికరిన హృదయులన్ 26

సీ॥ కరినాత్మ్కడగు దశకంఠుడిట్టుల బ్రేలి
రణమునగూలడే రాముచేత
పాంచాలి నివ్విధిబల్కి యా కీచకు
డంతంబునొందదే యవనిలోన
ఇంద్రుని సతిగోరి యింపుసొంపుమజెడి
యహిరూపమొందదే నహుషడవని
ఘనుడగు నింద్రుండు గౌతమసతిగూడి
తన శరీరముజెడి తల్లడిలడె

గీ॥ యొందరాని ఫలముల కాసపడిన
నేమిలాభంబుగలుగు నీకింక నిట్టి
వెర్రితనమికమాని వివేకమూని
యిలను వర్తించినను మేలుగలుగునీకు॥ 27

వ॥ గాన యిట్టి దురాలాపంబులుమాని గ్రూరవృత్తిన్విడచి సన్మార్గ ప్రవర్తకుండ
వయి వర్ధిల్లుటమేలు. నీలా! దుష్టశీలా! 28

శా॥ బాలాత్వన్మన ఏనెరుంగుదును నివ్వార్తల్ వచింపంగ నిం
కేలా నామది నిల్వజాల తమినింకెట్లయిన గానిమ్ము చాల్
చాలున్నాతో వివాదమేటికికన్ చాలించు నేబల్కి ని
న్నేలీలన్గొని పోవకన్ విడువ నా యిష్టార్థముల్ దీరగన్. 29

వ॥ అని విజృంభించి పైకిన్ గవయన్ గమకించిన కడుభయంబున నక్కుముద
వల్లి యతనిన్గాంచి యిట్లనియె॥ 30

కం॥ మగువలయెడ నీకిట్టులు
తగదుర పరుషోక్తులాడ తత్తరమున న
న్నగడేల జేసెదవు నో
యగమా నామీద దయయు నారయుమింకన్ 31

గీ॥ అనుచు నీ విధమునబల్క నాతడంత
నిలువ కచ్చెలి బలవింప నిర్దయతను
బలిమి నెత్తుకచని తన నిలయమునకు
జేరి యిట్లనె నిక జాగుచేసెదేల॥ 32

వ॥ ఓ యిందుముఖీ! నీ డెందంబున సందియం బొందెదవేలా! నిన్నున్ బరిణయం
బందెద సుఖంబుండు నట్లొడంబడవేని దిట్టతనంబున నిప్పట్టున నిన్నున్బట్టి
మన్మనోభీష్టం బవష్టంభబునన్ దీర్చుకొనియెదననిన నక్కుముదవల్లి దన
మనంబున ధైర్యంబూతగాగొని, ఓ నీలా! విను నాకొక్క సువ్రతంబుగలదు.
దానిన్ దీర్చెదవేని నీ యభిమతంబు సఫలంబు గావించెద నట్లుగాకున్న జల
విషాగ్నులన్ ప్రాణంబులు బరిత్యజించెదననిన నీలుండిట్లనియె॥ 33

గీ॥ నీ వ్రతంబెయ్యదియొ దెల్పు నిజముగాను
నదియు యెంతటి పనిదైన నరసి వేడ్క
జేయువాడను నిపుడు నీ చిత్తముల ర
ననిన నాచెలి యిట్లనె నతనితోడ॥ 34

వ॥ మద్వాంఛితంబును విను నీవు పంచ సంస్కార సంపన్నుండవై ద్వాదశోర్ధ్వ
పుండ్రంబులు ధరియించి మంత్రద్వయ రహస్యార్థంబెరింగి తులసీ పద్మాక్ష

మాలలుదాల్చి భగవద్భక్తి పరుండవయి నిత్యంబు వైష్ణవారాధనం బాచరించు చుండెదవేని నిమ్మున్ బరిణయంబంది నీ కోరిక లీదేర్చెదననిన నీలుండంత సంతోసించి వల్లెయని వెడలి సదాచార సంపన్నుండగు నాచార్యునిగాంచి వారి నారాధించి తత్కృపా కటాక్షంబునన్ వైష్ణవత్వ సంసిద్ధినొంది నిత్యవ్రతం బుగా వైష్ణవ తదీయారాధనంబు గావించుచు తిరుక్కూడ యూరన్ గుముద వల్లిని బరిణయంబంది నిజమందిరంబున సుఖంబుండి చోళమహీపతి కొప్పించు కప్పంబంతయు వైష్ణవ తదీయా రాధనంబునకున్ వ్యయపరచుచుండ నా వృత్తాంతంబంతయు సవిస్తరంబుగా నారసి మంత్రిపుంగవు లమ్మహీపతితో నిట్లనిరి॥ 35

కం॥ అయ్యా మన ధనమంతయు
చయ్యనగొని నీలుఁడధిక సాహసమున తా
నెయ్యెడ వైష్ణవులకు త
దీయారాధన మొనర్చి స్థిరమతినుండెన్॥ 36

వ॥ అని విన్నవించిన నభ్భూవరుండు రోషావేశంబున బొమలు ముడివడ కటం బు వదర భటులన్ జూచి మీరతిశీఘ్రంబున తిరుక్కూడయూరకిన్ జని నీలుంగాంచి మన కొప్పించవలసిన ధనం బిప్పుడొప్పింపుడని తప్పక నిర్బంధింపు డాత డొసంగినన్ ద్వరితగతిరండు. ఈకున్న నాతనిన్ బట్టి కట్టి నిటకుం దోడ్కొని రండు. పొమ్మని సెలవొసంగిన వారలత్యంత సంతసంబునన్ జని యట విష్ణుభక్తి పరాయణుండయి వైష్ణవోత్తముల నారాధించు యన్నీలుంగాంచి అతని వేషంబున కచ్చెరు వొందుచు సమయంబరసి జేరంజని యాద్దండల నమ్మండలాధిపతి నుడివిన చండవాక్యంబులు ఖండితంబునన్ జెప్ప నాతండు నరకుచేయకున్న నాదండి మగలు గండు మిగిలి చండ పరాక్రమంబున నాత నిన్ బట్టిముట్టడించిన నా జగజ్జెట్టి మట్టుమీరి దిట్టతనంబునన్ దట్టించుచు వారల నట్టిట్టున్ బోనీకనందరిన్ బొదివి పట్టికొట్టి నప్పురింవెలుపల నెట్టించి రాజోల్లంఘనము గావించిన వారలేమియున్ జేయునదిలేక నిరుత్సాహులయి రాజమందిరంబున కరుదెంచి రాజున్ గాంచి గడచిన వృత్తాంతం బాద్యంతంబు దైన్యంబునన్ విన్నవించిననమ్మేదినీకాంతుండు రోషారుణిత లోచనుండును క్రోధదందహ్యమాన మానసుండునునగుచు బండ్లు పటపటన్ గొరికి మంత్రి సామంతాది వీర వర్గంబులన్ గాంచి మీరలు రథాశ్వగజారోహకులై కవచభూష

ణంబులు ధరియించి ధనుర్బాణపాణులగుచు శీఘ్రంబరుదెండనిబలికి వీరభటు
లన్ జూచి మీరలు పరశు, పట్టిస, ప్రాస, ముద్గ, కుంత, గదా, ఖడ్గ, చక్ర,
ఛురికాది సాధనంబులుగొని సన్నద్ధులరయి వెడలుండని సెలవొసంగి తాన
భ్యంతర మందిరంబున కరిగి వజ్రకవచంబుదొడగి చందనాదులలంది రత్న
భూషణాద్యలంకృతుండై బాణ బాణాసన కృపాణంబులు ధరియించి భేరీ
ప్రముఖ వాద్యంబులు రోదోంతరాళంబు నిండన్ జతురంగ బలంబులతోడన్
వెలువడి తిరుక్కడయూరికిన్ జని యప్పురంబు ముట్టడించి యల్లకల్లోలంబు
గావించిన నా వృత్తాంతంబంతయు నీలుండు భటులచేతన్ విని రౌద్రావేశం
బున దనబలంబులన్ గూర్చుకొనివచ్చి రణంబున కోహటింప నయ్యిరు గెలం
కుల కత్యంత సంకుల సమరంబయ్యె నయ్యెడ॥ 37

గీ॥ ధరను చతురంగ బలంబుల తనువులెల్ల
దొరిగి శోణిత నదులలో దొప్పదోగ
ఘోరమయ్యెను రణభూమి శూరులంత
వెనుకదీయక బోరిరి వివిధ గతుల. 38

వ॥ అవ్విధంబునన్ బోరిపోరి తమ సైన్యంబు దైన్యంబు నొందిన నఘ్నా
వరుండు నీలున్గాంచి రోషావేశంబున నిట్లనియె॥ 39

పంచచామరము: ఒరే! దురాత్మ యించుకైన నోటులేక నాయెడన్
విరోధమిట్లు బూనితీవు భీతిలేక నిల్వుమీ
ధరిత్రి నిన్నుగూల్చకున్న తాపసుండనై వనిన్
చరింతుగాక! రాజనంచు సంచరింతునేయికన్॥ 40

వ॥ అనిన సరోషుండై నీలుండిట్లనియె॥ 41

పంచచామరము: ధరాతలేశునంచు నీకు తామసంబదేలరా!
సురేంద్రుడైన నాదుముందు నూటినిల్వలేడురా!
దురాత్మ! నీవనంగనెంత దున్మివేతు నిప్పుడే!
సరాసరీగ నాదుదృష్టి జక్కనిల్చి చూడుమా! ॥ 42

వ॥ అని నీలుండు బలికిన నా చోళ మహీవల్లభుండిట్లనియె॥ 43

కం॥ ఇటుల లజ్జలేక బల్కెదు
దిటవుగ ధనువెక్కుబెట్టి ధీరతతోడన్
పటు బాణ పరంపరలను
చటులగతిస్వేడుకను నిలుచు నిక్కగ నాతోన్॥ 44

వ॥ అనిన నీలుండిట్లనియె॥ 45

గీ॥ పోటుబంటువైతె పోరను నిలువుము
రిత్తమాటలేల పేర్మిలేదింక
నిదిగొ శరము వచ్చినది గాచుకొనుమంచు
గదియ నొకరికొకరు గడచిపోర॥ 46

వ॥ ఇట్లన్యోన్య జయకాంక్షలినుడింప గుణద్వయులు వియత్తల రథ రథ్యకేత
నంబు లస్త్రపరంపరలన్ గప్పుచు ఘోరంబుగా బోరుచయ్యవసరంబున నీలుం
డంత కంత కగ్గలంబగు నవార్య శౌర్య గాంభీర్య ధైర్య ధుర్యుండగుచు
నమ్మానవనాథున్ ససైన్యంబుగా బరాజితుంగావించిన నభ్భూమీశుండోటుపడి
నేమియుం జేయునదిలేక దీనాననుండగుచు నన్నీలున్గాంచి మన్న నీవు
నాచే గలిహరుండని బిరుదొందితివి. ఇయ్యెడ 47

కం॥ పరకాలుండ పటంబున
బిరుదొసగితి నీకు శత్రుభీకర యీ ని
ద్ధరనెల్ల నేలజాలుదు గా
కరయంగ యుక్తాయుక్తమాత్మ నిలుపుమా॥ 48

వ॥ అని పలికి 49

ఉ॥ రాజకుల ప్రదీపకుడ రాతి భయంకరుపేరనొంది తా
భూజనులన్మరల్చుకొని బొక్కుచునేగె పురంబుకట్లు శ్రీ
రాజిలగా జయంబుగొని రంజిలకంత గృహంబుజేరి సా
ధ్వీజన భూషణంబగు సతిన్గని నీలుడు బల్కెనత్తరిన్॥ 50

కం॥ ఈరాష్ట్రంబున నుండుట
కారయ నాకిచ్చగలుగదటు గావున ని
ద్దారుణి వైకుంఠమనన్
శ్రీరంగము వెలయునందు జేరదలంతున్॥ 51

కం॥ అని యిట్లు బలికి పతి నటు
గనుగొని యా కుముదవల్లి గడు సంతసమున్
మనమున బెనగొని తాని
ట్లనియెను నాకోర్కె సఫలమయ్యెను వినుడీ॥ 52

చ॥ పరగుననేగి యచ్చటను సమ్మతి కోవెలమంటపాళి గో
పురవర వప్రిమున్ మిగుల బొంకముగారహి నొప్పగట్టి శ్రీ
కరుడగు రంగనాధునకు ఖ్యాతిగ నర్పణజేసి భక్తి ని
ద్ధరను తరించుబొప్ప నిదితప్ప మరొక్కటి గానజేయుమా॥ 53

వ॥ అని తన సతిబలుకు పలుకులకియ్యగొని పరకాలుండు కడు సంతసమున భట
వర్గంబులన్ వెంటగొని 54

సీ॥ అంతట పరకాలుడతి శీఘ్రగతినేగి
కావేరి మధ్యను ఘనతమీరు
శ్రీరంగమును వేడ్కజేరి యా వయ్యారి
రంగని సేవించి పొంగి భక్తి
ప్రాకారగోపుర శ్రీకరమంటపా
వళులను గట్టించె వైభవముగ
చేతి ద్రవ్యము ఖర్చుచేసియు నవ్వల
ధన మధాందులబట్టి తరిమికొట్టి

గీ॥ ద్రవ్యమవ్విధి నార్జించి భవ్యముగను
వైష్ణవారాధనంబతి భక్తితోడ
ననుదినంబునుచేయుచు నన్య విషయ
చింతలనువీడి రంగని సేవదగిలి॥ 55

కం॥ తనభట వర్గము వెంటను
గొని యెల్లడలందు దార్లగొట్టుచు నిత్యం
బును వలయు ధనము గూర్చుచు
ననయత నిత్య వ్రతంబు సల్పుచునుండెన్॥ 56

సీ॥ తన సతీతిలకంబు తద్దయుగొనియాడ
నిటువేడ్క విహరించి భటులగూడి
నొక్క దినంబున నెక్కడికేగిన
చిక్కకుండెను ధనమక్కజముగ
పట్టణంబుల పల్లెపల్లెల నూళ్ళను
కలయంగ దిరిగియు వలసియలసి
విసికి మనంబున వేసరి వేసరి
భటులను గనుగొని బలికెనిట్లు॥

గీ॥ నేమిసేయువాడ నెయ్యది మార్గంబు
నెట్లు నిర్వహింతు నీ వ్రతంబు
వ్రతముజెల్ల దేనివర్జింతు ప్రాణమ్ము
లనుచు నిశ్చయించి యాక్షణంబ॥ 57

వ॥ అని యిట్లు భటులతోడన్ బలికి॥ 58

కం॥ ఘనమగు నొక వనమునకున్
జని రంగని దివ్యపాద సరసీజములన్
మనముననిడి నొకవృక్షం
బునునెక్కి భటాళితోడ భువికురుకంగన్॥ 59

వ॥ ఇట్లు వృక్షాగ్రంబునుండి భువికిలంఘించ నిశ్చయించి దనచిత్తంబు శ్రీరంగ
నాథుని పాదారవిందంబులాఘూఢ భక్తినిల్పి ప్రాణ పరిత్యాగంబుజేయ నిశ్చ
యించి ఇట్లని స్తుతించె॥ 60

దండకము: శ్రీ రంగనాథా రమానాథ లోకాధినాథా బుధారాధనాధీర రారా నిరాకార
సాకారరూపా ప్రదీపా సురేంద్రాది సంసేవ్యమానా నిధానా సదాభక్త
సంతాన సన్మానిరాట్పోషణాతోషణా దానవానీక సంశోషణా దీనమందార
వేదాంత తత్త్వార్థసారా సదావేద వేదాంగ సంచార సర్వజ్ఞ కంధివిహారా
ప్రపంచాత్మ సర్వేశ ఈశా మహీశా పరార్ధ ప్రకాశా భవన్నాశ నీ దివ్య
లీలావతారంబులన్ నెన్న నా బ్రహ్మరుద్రాది సద్దేవతాకోటికయినన్
దరంబౌనె యో సచ్చిదానందరూపా యనంత వ్రతాపాద్భుతా సత్య
సంకల్ప శేషాహితల్పా పరంధామ సంపూర్ణకామా త్రిలోకాభిరామా
గుణస్తోమ నన్నున్ గృపన్‌జూడుమా నీదు పాదారవిందంబులే ప్రాపుగా
గోరియున్నాడ సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య మోక్షప్రదాతా
సరోజాత నేత్రా సుచారిత్ర లక్ష్మీకళత్ర భవద్దాసదాసానుదాసుండ నిన్నె
న్ననేనెంత వాడన్ దయన్‌జూడుమోదేవ తుభ్యమ్ నమస్తే నమస్తే
నమస్తే నమః 61

వ॥ అని ఇట్లా మూఢ జ్ఞానంబునన్ ధ్యానంబొనరింప. 62

కం॥ నారాయణుండు జగదా
ధారుండును బరమభక్తి తత్పరుదగుటన్
కూరిమితో సద్దాసుని
కోరికదీర్పంగ నటకునొబ్బున వెడలెన్॥ 63

సీ॥ నీరదాభశరీరు నిగమాంత సంచారు
నవమోహనాకారు భవవిదూరు
సకలలోకాధారు సజ్జన మందారు
వరమేరు నగధీరు వనవిహారు
శంఖచక్ర సుఖడ్గశార్ఙ్గ గదాహస్తు
నవ్యభూషణు సద్గుణ ప్రశస్తు
హారకిరీట కేయూర కుండలభూషు
శ్రీవత్సలాంఛనాంచిత సువేషు

గీ॥ భక్తజనపోషు యాశ్రిత పరమతోషు
భావజ విలాసు వైకుంఠపద నివాసు
విమలతరకీర్తి శ్రీ మహావిష్ణుమూర్తి
చక్షురానందముగను ప్రత్యక్షమయ్యె

వ॥ భక్త సంరక్షణాక్షీణ కృపావీక్షణ దక్షుండును శరణాగతరక్షణుండును వైవాహికదీక్షా విలక్షణ లక్షితుండునునగు పుండరీకాక్షుండు లక్ష్మీసహితుండై రత్నస్థగిత ధగద్ధగాయమాన దివ్య విభూషణ భూషితుండును పీతాంబర ధరుండును కోటిసూర్య ప్రభాభాసమాన విలాసుండును సకల జనానంద కందళిత హృదయారవిందుండునునగుచు అనంత గరుడ విష్వక్సేనాది ప్రధానకింకర సందోహంబులుగొల్వ భగవద్బింబ పరిపూర్ణ కళావాహన క్రియా సమర్థాధికార సర్వ ప్రయోగజ్ఞాన నైపుణ్యులగు వైఖానసులును నాలాయిర దివ్య ప్రబంధానుష్ఠాన తత్పరులగు వైష్ణవులును వేదవేదాంగాధ్యయన కోవిదులగు భూసురులును కవి నట గాయక వైణిక వైతాళికాది విద్వజ్జనంబులును భేరి మురజ మర్దళ తాళ గౌరీకాహళ శంఖ మురజ ఢక్కా పటహాది సకలవాద్య విశేషంబులును బరమ భాగవతబృంద సంకీర్తనంబులును మెరయ మహద్వైభవంబుతో గృపాలలిత కటాక్ష వీక్షణాలంకృత సుందరవదనార విందంబు శోభిల్లన్ వేంచేసి పల్లవ కుసుమ పరిమళ మిళితంబును ఫలభరితంబును లలిత సైకత సుధాసలిల పరిపూరిత కమలాకరంబులున్ గలిగి నతిరమణీయంబగు నయ్యరణ్య మధ్య ప్రదేశంబునన్ దిరువేట మహోత్సవంబవధరింప నిశ్చయించి నందుగొలువై యుండి రమాదేవిన్గాంచి మాధవుడిట్లనియె ౬౪

గీ॥ పొలతి యీ ఘనవనములోపల విచిత్ర
కుందచందన మందార కోవిదార
సార ఘనసార నింబ జంబీర పనస
తరుల సిరులొప్పు నివ్వన మరసిచూడు॥ 65

వ॥ అని పలికిన నాధునిన్‌గాంచి యద్దేవి యిట్లనియె 66

గీ॥ ప్రాణనాయక యీ వనపాదపముల
నింపుదళుకొత్తు పొదరిండ్లనెల్ల కుసుమ
సారములు గ్రోలు మధుప సంచయము శుకపి
కాదిరవములు మదికి నామోదమొసగె॥ 67

వ॥ అనిన మోమున జిరునగవంకురింప శ్రీహరి యిట్లనియె॥ 68

సీ॥ పొదరిండ్లుగావివి పువ్వుబోణిరా చూడు
తుంటవిల్తుని బాణమంటపములు
చిగురాకులివిగావు మృగమద తిలకంబ
కంజబాణుని చేతి ఖడ్గసమితి
కంజాక్ష భృంగఝంకారములివిగావు
మారుని యిక్షువిల్నారి మ్రోత
వికచాబ్జముఖి శుకపిక కూజితముగాదు
కాముని సైనిక కలకలంబు
విరులుగావివి మారుని శర చయంబు
కలికి విహరించు వనమిదిగాదు మరుడు
విటులపై దండువిడిచిన వీడు జూడు
మనుచు నవ్వని విహరించు నవసరమున 69

మ॥ పరకాలుండటగాంచి సంతసము భావంబందు నుప్పొంగగా
తరుమూలంబున కంతడగ్గి మరలన్ తత్సైన్యముంగూడి యా
తురతన్ వారలతోడ నిట్లనియె మీతో నేను రానింక న
త్వరులై మీరటులేగి యా జనములన్ దర్పంబు లుప్పొంగగన్॥ 79

గీ॥ జాగుసేయక వారల వేగబట్టి
విత్తమును భూషణంబులు వేడ్కగొనుచు
పట్టుండ కిచ్చుటికిరండు పరిజనమీర
నసుచు బలికిన వారలు నతిముదమున 71

కం॥ అయ్యా దమ యాజ్ఞను మే
మయ్యెడకున్ బోయి వారి యాచరణంబుల్
చయ్యన గొనివత్తుము మీ
రియ్యెడ గూర్చుండుడనుచు నింపుదలిర్పన్॥ 72

వ॥ అని యివ్విధంబున నభ్భటులగ్గురు వరునకభివందనం బొనరించివెడలి విచ్చల
విడిన్ వచ్చుచుండ ననతి దూరంబున అనంత గరుడ విష్వక్సేనాదులు వారిన్
గాంచి మనంబుల నచ్చెరువొందుచు దమలోదాము యిట్లనిరి. 73

సీ॥ పట్టెనామంబులు దిట్టమ్ముగా బెట్టి
యిట్టట్టులాడుచు మిట్టిపడుచు
మట్టెలాగులు దాల్చి ధట్టీలుబిగియించి
జుట్టీలవలె మించి చంక దుడ్లు
బెట్టి కరముల బాకులిట్టిట్టు మెరయంగ
నట్టె కొండీ శిఖల్ జుట్టి మిగుల
గట్టితనంబులు యుట్టిపడంగ
నిప్పట్టున వచ్చెడి దిట్టలెవరొ
గీ॥ వారిసేష్టలు జూచిన చోరులవలె
గానుపించుచున్నారు గావున వీర
లెవరొ గనుగొనవలెనంచు నెంచుచుండ
వారలంతట జేరగ వచ్చిరపుడు॥ 74

వ॥ ఇట్లు జేరవచ్చినవారిన్ గాంచి అనంతగరుడ విష్వక్సేనాదులిట్లనిరి. 75

కం॥ మీరటు ధారుణిలోపల
నేరాజుకు భటులు వంశమెయ్యది మరి మీ
యూరెయ్యది పేరెయ్యది
యారూఢిగదెల్పు డిప్పుడందరు మాతోన్॥ 76

వ॥ అని యడిగిన నాచోరులిట్లనిరి. 77

కం॥ శ్రీరంగము మా నిలయం
బారంగని దాసవరుల పూరయ ని
ద్ధారుణి మాతో సరియగు
శూరులు లేరయ్య బెవరి జూచెదరేలా॥ 78

కం॥ హరిభక్తాగ్రేసరుడగు
పరకాలుడు గురువు వారి పనుపునన్
ధరయెల్ల సంచరించుచు
పరధనముల నెల్లగొనుచు బ్రతికెడుమెపుడున్. 79

గీ॥ వారి యాజ్ఞానుసారంబు వచ్చినార
మయ్య మీ ధనమంతయు నపహరింప
కేమి విడుచుటలేదు మీకెందుబోవ
వచ్చు మాపాలిదైవము దెచ్చె నిటకు॥ 80

వ॥ మరి మాతోబోరు శూరులిద్ధారుణీతలంబున లేరుగాన మీరు మమ్ములన్ దేరి
చూడన్ జాలుదురె యింతట బింతంబులుమాని పంతుకెక్కిన యాభరణం
బులు మాచెంతన్బెట్టి మీరంతన్ జనుండనుచున్ జెలరేగి పైపైన్ గమకించి
బట్టన్బోవు చోరులన్గని అనంత గరుడ విష్వక్సేనాదు లప్పట్టున వారిన్
బట్టి పట్టిట్టు గదల్పనీక రెట్టించి గాలన్బెట్టి నేలన్ జమరికట్టి వారలనద్దేవుని
ముందటన్బెట్టిన నా భగవంతుండు కృపాళుండయి విడువ నాజ్ఞాపింప వారల
టుల నొనర్చిన వేగంబరునెంచి దిగ్గున నగ్గురువరు చెంతకున్ జని దీనానను
లగుచు నా వృత్తాంతంబు సవిస్తరంబుగానుడివి యతని పాదంబుల పయిం
బడి విలపింప నంత వారలన్గాంచి పరకాలుండు దురాగ్రహంబున మిమ్ముల
నివ్విధంబునన్ బరిభవించిన నద్దురాత్ములన్బట్టి మట్టుబెట్టి రట్టుజేసి కట్టి
చిత్రంబులలయించి విత్తంబంతయు నిప్పుడదెత్తున్ నాశక్తింజూడుండనుచు
గోధఘూర్ణాయ మాన మానసుండగుచు ప్రళయకాల దహను ననుకరించి తక్ష
ణం బచ్చోటున్ వెలువడి యిలాతలంబు గ్రక్కదలన్ బరిజనంబుతోడన్
వచ్చు నప్పరకాలున్గాంచి అనంత గరుడ విష్వక్సేనాదు లత్యంత భయాశ్చ
ర్యమగ్నమాన మానసులై జూచుచున్నంత నాతండు వారలన్ జేరన్జని సక్రో
ధుండయి యిట్లనియె. 81

కం॥ వినరయ్యా మిమ్మందరి
మనమున సందియము లేక మర్దించి రయం
బున మీ యాభరణంబులు
గొని చనియెద జూడుడే నకుంఠిత వృత్తిన్ 82

వ॥ అని పలికిన నాహరి భటులతనికిట్లనిరి॥ 83

కం॥ యేరా మాతోడ బహు
మేరమీరి యిటులబల్కి మెప్పటరా! బల్
శూరులమని వచ్చిన మీ
వారల గతి వినగలేద వదరకబొమ్మా! 84

వ॥ అని యివ్విధంబునన్ బలికిన నప్పరకాలుండ దరిపడి ప్రళయ కాలరుద్రుని
చందంబునన్ దేరిచూడరాక వారలన్గాంచి మీరనెంత దేవబృందంబులన్
గూడి యింద్రుండరుదెంచినను ఏనువెరచువాడన్గాను బింకంబులేల శంకలేక
నింక వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యమౌక్తికాది రత్నస్థ
గింతంబులయి మహోజ్జ్వలంబులై యొప్పు మీ దివ్యాభరణంబులెల్ల గేల నప
లీలన్గొనియెద మత్సామర్థ్యంబు జూడుండు. 85

గీ॥ వారియొడలనున్న వరభూషణంబులు
గొనియు నపలబెండ్లి కొమరుచెంత
కరిగి వారి దివ్యహారాదులన్నియు
సంగ్రహించి వేగజనియె నంత॥ 86

వ॥ అనంతరంబ నారాయణుండు 87

గీ॥ ఇందిరేశుండు తనదాస బృందములను
గాంచి యాశ్చర్యమును లజ్జ గడలుకొనగ
ననియె మీరలు వేగంబజనియు వారి
నిటకు దొడ్కొనిరండు మీరట యనుండు॥ 88

సీ॥ అనుచు హరి వారికానతివ్వ ననంత
గరుడ విష్వక్సేనులరయ వెడలి
గహనమెల్లెడలను గలయంగ వెదుకుచు
నొక్క భూధరమున నెక్కుచున్న
వారలగాంచి యోపరకాల! వేవేగ
మిమ్మచ్చటికి గొనిరమ్మటంచు
హరియాజ్ఞ నొసగినారని విన్నవించిన
తనమది సంతోషమున జెలంగ

గీ॥ భట సమూహము వెంటను బలసికొలువ
వచ్చి యాదేవుని సన్నిధికొచ్చి నిలచి
యున్న నంతట గనుగొని వెన్నుడపుడు
బలికె నతనితో ఘనవాక్య ఫణితిమీర॥ 89

కం॥ నీ తలిదండ్రులెవ్వరు
భూతలమున నీ నివాసపురమెయ్యది వి
ఖ్యాతిగ బంధువు లెవ్వరు
చేతో ముదమొదవ బేరుజెప్పుడు మాతోన్॥ 90

వ॥ అనిన నా చోరాగ్రేసరుండిట్లనియె. 91

కం॥ జనకుండు మహావిష్ణువు
జనని రమాదేవి బంధుజన సముదయముల్
ఘన విష్ణుభక్తులెల్లను
విను భువనత్రయము నాకు విహరింపనగున్॥ 92

కం॥ పరకాలుండను నామాం
తరమున జెలువొందువాడ తథ్యముగా నీ
పరివారముగొని వేచని
ధర ధనికులబట్టి వారి ద్రవ్యము గొందున్॥ 93

కం॥ ధారుణి శ్రీరంగంబున
జేరి సదా వైష్ణవులను సేవించుచునే
నీరీతి ధనము గైకొని
వారల కారాధనంబు వ్రతముగ జేతున్॥ 94

వ॥ అని యిట్లు బలుకు చోరపుంగవునితో నారాయణుండిట్లనియె॥ 95

ఉ॥ దొంగతనంబు జేయుటయు దోవలు గొట్టుటయున్ జనంబులన్
భంగము బెట్టియున్ ధనము పార్జనసేయుట ధర్మమౌన స
త్సంగతిగాంచి యార్యజన సంఘముమెచ్చ నటించుటొప్పు శ్రీ
రంగని దాసునంటివి చిరంబుగ మేమది నమ్మకెట్లగున్॥ 96

వ॥ అనిన పరకాలుండిట్లనియె. 97

గీ॥ దుష్ట విగ్రహంబు శిష్టప్రతిపాల
నంబుజేయ నాకు నైజగుణము
గాన పరులధనము గైకొను నిన్ను నే
నాజ్ఞసేయకుండ నగునె యట్లు॥ 98

వ॥ అని యివ్విధిన్ బల్కు భక్తవత్సలునితో చోరగురుండిట్లనియె॥ 99

కం॥ నను మీరలు దండించిన
ఘనమగు నీ సువ్రతంబు గడుహగజాలన్
అనయము తవదాసాన్ దా
సునిగా జేపట్టి గృపనుజూడు రమేశా॥ 100

వ॥ అనుచు నప్పరకాలుండు దనమనంబున భయ సంభ్రమములు మప్పిరిగొన నప్పుడద్ది వ్యాభరణంబులెల్ల నప్పుండరీకాక్షుని సాన్నిధ్యంబునన్ సమర్పించి వినయ భయభక్తిన్ బునః పునః ప్రణామంబులాచరించి నిటలతట ఘటితాంజలి పుటుండయి యా శ్రీమన్నారాయణు ననంత వాత్సల్య సౌశీల్య సౌహార్ద్రాద్యపరిమిత కళ్యాణగుణ సందోహంబుల బహు ప్రకారంబులన్ వినుతించి యత్యానంద భరితుండయి యిట్లనియె॥ 101

కం॥ మందరధర సుందరతర
కుందరదన యిందిరేశ కోవిద వంద్యా
యిందురవినేత్ర బురహర
వందిత నీ దివ్యపాద వనజము దలతున్ 102

కం॥ శ్రీశా, పరమేశా; చి
ద్కోశా॥ భవనాశ॥ ఈశ। గురుగుణకోశా॥
ఆశాపతినుత సకలా
త్మేశా నీపాదయుగము హితమతి దలతున్॥ 103

కం॥ దేవాదిదేవ నీ పద
సేవకుడను వేగ నన్ను జేపట్టి దయన్
బ్రోవవె నా యపరాధము
గావవె నా గతియు నీవె కారుణ్యనిధీ॥ 104

కం॥ వందనమిదె గైకొను గో
విందా చిదానందకంద విశదముకుందా
బృందారక బృందార్చిత
మందర నగధీర మాన్యవిచారా॥ 105

కం॥ అత్యద్భుత చరితహరీ
సత్యవ్రత దేవదేవ సమధికభావా
గత్యంతర మిక నెఱుగను
సత్యము యపరాధ సమితి క్షమియింపుమిఁక న్. 106

వ॥ అని యివ్విధంబునన్ వినుతించిన శరణాగతరక్షణ దీక్షాదక్షుండగు రమాధ్య క్షుండ క్షీణ కృపాకటాక్షంబు వెల్లివిరియ నా బరమభాగవత శ్రేష్టున్గాంచి నీదృఢభక్తికేను సంతసించితి నీకున్ తిరుమంగయాళ్వారను నామం బొనరించితి నిష్టన్ వైష్ణవారాధనం బాచరించుచు జ్ఞానభక్తి, వైరాగ్య సంపన్నుండవై యంతంబున మత్సాన్నిధ్యంబు నొందువాడవని యాజ్ఞనొసంగి యద్దేవదేవుడు భక్త సందోహంబులు గొలువ నత్యంత విభవంబున నిజాలయంబునకున్ విజయంబుజేయుటయు. 108

కం॥ ఘనమతి నీ సుచరిత్రం
బును విన ఇరియి చిరేని విశ్రుతముగ నా
వనమాలి కటాక్షంబున
ననయము నిహపర సుఖంబులందు దురవనిన్॥ 107

శా॥ శ్రీ బాలామణి మానసోత్పల శరశ్చీతాంశు బింబాననా
యాబాల్య ప్రభృతి ప్రదర్శన యశోదానంద మాహాత్మ్యకా
జా బాల్యాది మునీంద్ర సేవిత ఘనశ్యామా మరుద్వందితా
శ్రీ బాపట్లపురీ సుధేలన ఘనా శ్రీ భావనారాయణా 108

శ్లో॥ క్షీరస్రేత్రే తీర్థాయ క్షీరసాగర శాయినే
రాజ్యలక్ష్మీ సమేతాయ భావదేవాయ మఙ్గళం.

గద్య

ఇతి శ్రీ భావనారాయణ, కృపాలలిత కటాక్షవీక్షాన మాసాదితాన వద్య
కవిత్వ విద్యా విరాజమాన నల్లూరి వంశ పయః
పారావార సుధాకరాయమాన గౌతమ గోత్ర
పవిత్ర వేంకటాయాచార్య పుత్ర సుకవి
జన విధేయ రంగాచార్య నామధేయ
ప్రణీతంబైన తిరుమంగయాళ్వారు
చరిత్రము – ఏకాశ్వాసము
సర్వంబు సంపూర్ణము.

శుభమస్తు ఓం శ్రీసాయినమః అవిఘ్నమస్తు

శ్రీభావనారాయణస్వామినేనమః శ్రీవిఖనసమహాగురవే నమః



# శ్రీ హరినామకీర్తనలు

శ్రీభావదేవమభయ ప్రదమబ్జహస్తమ్
చండాంశుకోటి రుచిరోజ్జ్వల తీక్ష్ణచక్రమ్।
సోమ ప్రకాశజలజంకటి మధ్యపాణిమ్
వన్దేరమావసుమతీ సహితం సురేశమ్॥

దివ్యం క్షీరపయోధిజాతమమలం దేదీప్యమానంవరమ్
కోటీరం వర మందిరం గిరిధరం సత్కంధరం సుందరమ్
మందస్మేర సుధా మనోజ్ఞవదనం మార్తాండ కోటి ప్రభమ్
శ్రీబాపట్ల పురీశమీశమనిశం శ్రీ భావనారాయణమ్॥

కాశ్మీరాగరు చందనాంచిత భుజగ్రైవేయహారావళి
ముక్తాదామ విలంబితోన్నత భుజ శ్రీవత్సవక్షస్థలమ్
చంచత్కాంచన రౌప్య కృద్విలసితచ్ఛిద్యూర్ధ్వ పుండ్రం భజే
శ్రీ బాపట్ల పురీశమీశమనిశమ్ శ్రీ భావనారాయణమ్.

హిందూస్తాని - కాపీరాగం - అటతాళం

1] శరణూ! శ్రీ విష్వక్సేనదయానిధే, కరుణతో నన్నేలరా! హరే! ॥శరణూ॥
దురితపహార! దుష్ట సంహారా ! హరిసేనాధిప హరే ! హరే! ॥శరణూ॥
సూత్రవతీశ! సుగుణ సంకాశ! వేత్రధారణ శుభదా హరే! హరే! ॥శరణూ॥
రంగుగ నల్లూరి రంగదాసాం తరంగ నివాసక! హరే! హరే! ॥శరణూ॥

ఖమాచిరాగం - ఆదితాళం

2] రాజ్యలక్ష్మి ! బ్రోవవే! రాజీవనేత్రి! రాజ్యలక్ష్మి! నన్ను బ్రోవవే!
సురరాజ, రాజరాజవందితాంఘ్రి రాజ్యలక్ష్మి! నన్నుబ్రోవవే!
కుందకుట్మలరదనా ! - ఇందువదన ! సుందరాంగి !
ఇందువచ్చియిపుడానంద మొందదాసబృందమేలుమీ! రాజ్యలక్ష్మి !
భావదేవుని రాణి! భక్త పోషిణీ ! భావపట్టణనివాసినీ!
శ్రీ భవ్యచరితరంగదాసపాలినీ ! రాజ్యలక్ష్మి బ్రోవవే !

తోడిరాగం — ఆదితాళం

3] కరుణించరా ! భావదేవ! కరుణానిధే
కరివరదా! నను అరమరసేయక కరుణించరా !
మదనజనక ! నిన్నే మదినెరనమ్మితి సదయుడవగుచును సరగునబ్రోవరా!
ఆదరించకనను అరమరజేయుటేలర! మోదమొసగనాతో వాదముసేయక కరు॥
పొంగుచు శ్రీభావపురమున నెలకొని-రంగుగ నల్లూరి రంగదాసనుత కరుణించరా!

కాఫీరాగం — ఆదితాళం

4] నారాయణునిపద - నీరజములదరి - జేరగోరవె మనసా !
సారహీన సంసారాంబుధిపడి-విచారమొందగ నేటికే ఓ మనసా! ॥నారా॥
ఈషణత్రియముల-గోసి వేయక చాల-వేసటబడ నేటికే !
శ్రీసతి హృదయేశు చిత్తములోనిడి-వాసిగభజియింపవే! ఓ మనసా! ॥నారా॥
అరిషడ్వర్గములచే-నాయాసమొందుచు_నిరతము చెడనేలనే !
పరమపురుషుపద-పంకజములు సదా-మరువకస్మరియించవే ఓ మనసా! ॥నారా॥
ధరలోన శ్రీభావపురమున వెలసిన-కరివరదుని గొల్వవే !
వరరంగదాసుని కరుణనేలిన మురహరుని శరణనిమనవే! ఓ మనసా! ॥నారా॥

ఝుంఝూటిరాగం – ఆదితాళం

5] భావపురివాసా ।-భవహరోల్లాసా। పావనాకార। నీ పదములె నమ్మితి- ॥భావ॥
పాలవృక్షమునందు-ప్రభవించితివియిందు-మేలుగ భక్తుల పాలకల్పభూజమ॥భావ॥
వరరాజ్యలక్ష్మీశ । వందితవాగీశ। శరణాగతరక్షణ బిరుదుగల్గిన తండ్రి। ॥భావ॥
వరరంగదాసపాలా। వర్ణితస్వర్ణచేలా। మంగళాకార। సదామమ్మేలు నాసామి। భావ॥

బేహగ్‌రాగం—చాపుతాళం

6] నను బ్రోవు భావ-నారాయణా। పనిబూని-ఈ ప్రార్థనవిని నను బ్రోవు
చక్కని నీశ్రీ చరణాబ్జములే-మక్కువతోడ మది నమ్మియుంటి
దిక్కుకనీవే దీనరక్షక । నన్నెక్కుడు కృప నేలు మీ వేళ ॥నను॥
పొంగుచు శ్రీభావ-పురమున వెలసి-మంగళాకార। సంగతి మీర
రంగుగ నల్లూరి రంగదాసునేలి-శృంగారమున చెలగితి వీవు ॥ననుబ్రోవుభావ॥

బేగడరాగం – ఆదితాళం

7] రాదా నీ దయ-నాపై-రాజ్యలక్ష్మీలోల। పాదసేవకుడను-వాదమేలనాతో ॥రాదా॥
పన్నగశయన। నీ చిన్నిపాదములే-సన్నుతిజేతు-నాపన్న జనప్రసన్న ॥రాదా॥
హాటకాంబరధర। అఖిలదేవమందార। యేటికి నను బ్రోవవిది నీకుమరియాదా। ॥రాదా॥
పొంగుచు శ్రీభావపురమున నెలకొన్న-అంగజ జనక। శ్రీరంగదాసపోషక। ॥రాదా।

కళ్యాణిరాగం-ఆదితాళం

8] భావపురీనిలయా। మాంపాలయా। నీవే దైవమనుచు-నిజముగనమ్మితి- ।భావపురీ।
రవికోటి సంకాశా। రాజ్యలక్ష్మీశ। సవినయముగ నిన్నె చాలనమ్మితిదేవ ।।భావ।।
మారుతీసుతనుత మదినిన్నె నమ్మితిరా।రారా। నా మనవి-చేకోరా।సజ్జనాధార। ।।భావ।।
చందనచర్చిత-చారుశరీర। ఇందిరాహృదయారవిందనందితదేవ। ।।భావపురీ।।
సరసిజాసననుత। సన్మౌనిపూజిత। వరరంగదాసహృద్వనజవికాసా।।భావపురీనిలయా।।

మారువరాగం - ఆదితాళం

9] భావనారాయణ రారా। భావనారాయణ భక్తపరాయణ।
దేవాది దేవ। నన్ను బ్రోవరారా । శ్రీ భావనారాయణరారా।
నిక్కము నీ పద నీరజములనునే-మ్రొక్కెదనీవే-నా దిక్కు-రారా। ॥శ్రీభావ॥
పావననామా । నన్ను బ్రోవ వదేమిర। నీవాడనన్నిటు-గావరారా। ॥శ్రీభావ॥
నీలవర్ణభక్తపాలా। కనకసుచేలా। నన్నేల శ్రీలోల। రారా। ॥శ్రీభావ॥
మందరోద్ధార। మునిబృంద మందార। గోవింద। ముకుంద। నీవిందురారా॥శ్రీభావ॥
వాసిగ బాపట్లవాసా। వెరరంగదాసపోషక। చిద్విలాస।రారా। ॥శ్రీభావనారాయ రారా॥

బేహాగ్‌రాగం-ఆదితాళం

10] బాల చంద్రానన। భక్తజనావన। పాలిత మునిజన। రావోయీ ॥బాలచంద్రానన॥
ఏలుకొనుచు నినుచాలగ నమ్మితి జాలము సేయుట మేలటరా ।
నీలవర్ణ। సుగుణాలవాల। శ్రీలోల। వేగమెయిందురావోయి। ॥బాలచంద్రా॥
నిరతము తావక చరణములనునే స్థిరముగ నమ్మితి చిత్తమున
కరివరునేలిన-ఘనుడవనుచు నీ మఱుగు జొచ్చితిని రావోయి। ॥బాల॥
విరివిగ భావపురవరమున వెలసిన-వరభావదేవ। యింతవాదేలా ।
ధరను నల్లూరి రంగదాసపోషక । భక్తవరద। వేగమెయిందురావోయి। ॥బాల॥

సురటరాగం - ఆదితాళం

11] సరోజదళనయనా । సామిగా ఓ సరోజదళనయనా ।
పరమపురుష। నీ-మరుగు జేరితిరారా - ॥సరోజదళనయనా॥
సామజవరదా। కామితఫలదా । నీమముతో
నీ నామ మెదలచెద-వామనరూప। నన్ను ప్రేమతో బ్రోవరా ॥సరోజ॥
నారద పోషణ । నవ్యసుభూషణ। వారిజనాభ । వందితచరణా ।
క్షీరాబ్ధిశయనా । శ్రితపరిపాలన । సరోజదళనయనా।
వాసిగ భావపురి వాస। నల్లూరి రంగదాసపోషక । నను
మోసము సేయకు - వాసవనుత । నీకు దోసి లొగ్గితిరార । ॥సరోజ॥

భైరవిరాగం - ఆదితాళం

12] కరిరాజవరద ౹ నను కరుణచే బ్రోవరాదా ౹
సరసిజ భవసన్నుత ౹ సన్మౌనిజనవందిత ౹ కరిరాజ౹
భూరి సుగుణధామ ౹ పుణ్యజనవిరామా ౹ నీరదనిభశ్యామా ౹
నిజభక్త జనకామ౹ కాంచనాంబరధర౹ కౌస్తుభమణిహార ౹
పంచశర సుకుమార ౹ పారావార గంభీర ౹ కరిరాజవరద ౹ ॥నను॥
వాసిగ బాపట్ల నివాస౹ నల్లూరి రంగదాసార్చిత సువిలాస ౹
వాసవనుతవేష ౹ కరిరాజవరద ౹ ననుకరుణచే బ్రోవరాదా ౹

అఠాణారాగం - ఆదితాళం

13] నా మనవి వినవదేమి సేతురా ౹ నమ్మితి నిను శ్రీధర ౹ సామి౹
నా మొరాలకించిబ్రోవవదేమి ? నీకు భారమా ౹ యొయ్యారను ౹ ॥ నా మనవి ॥
క్షీరసాగర విహార ౹ భక్తమందార ౹ మేరుధీర ౹
శ్రీరమాధినాధ౹ సింధు ధీర౹ వారి జాక్షవంది తామరేంద్ర౹ ॥ నా మనవి ॥
మౌనిమానస సుఖేల ౹ దాసపరిపాల ౹ కనకచేలా౹ గానలోల ౹
కరుణావిలోల ౹ అభిమానశీల ౹ మహీమండలపాల ౹ ॥ నా మనవి ॥
బావపట్టణ నివాస ౹ శ్రీశ౹ సద్భక్త మనోల్లాసా౹ భావజారివందిత ౹
సువేష ౹ సావధానరంగదాసపోష ౹ ॥నా మనవి వినవదేమి సేతురా॥

హిందూస్థానీ కాఫీరాగం - ఆదితాళం

14] గజపతివరద ౹ కరుణతో బ్రోవర ౹ భజన జేసెదను భావజారినుత౹ ॥గజపతి॥
కంజభవాదుల-కరుణనుగాచిన-మంజులాధర ౹ నీ కంజలి జేసెద ౹
ముజ్జగములను మోదముతో బ్రోచి, గజ్జలపదములు 'ఘల్లుఘల్లని మ్రోయరార
వాసిగ బాపట్ల వాసా౹ వరరంగదాస పోష ౹ శ్రీశ వాసవ వినుత ౹ ॥గజపతి॥

హిందుస్థానీ కాఫీరాగం - అదితాళం

15] ఎన్ని విధముల నిన్ను - సన్నుతించిన వినవు -
పన్నగారి వాహన ! నీ కన్నదైవము లేదురా ! ॥ఎన్ని॥
కన్నవారివేడి-గాసిజెందియుంటినిర !
సన్నుతాంగ ! నను నీ - కనుల జూడవదేర ! ॥ఎన్ని॥
చిన్ననాట నుండి నే - నిన్నె నెర నమ్మితి
నన్నేటికి బ్రోచెదో ! అ పన్న జనరక్షక ! ॥ఎన్ని॥
వాసిగ బాపట్ల పురనివాస ! నల్లూరి రంగదాసు నేలిన వాడవని
దోసిలొగ్గితి నా స్వామి ! ॥ఎన్నివిధముల నిన్ను॥

హిందుస్థానీ - కాఫీరాగం - అదితాళం

16] ఏలర రమాపతే ! నన్నేలర రమాపతే! జాలమేల జలజాసనసుత! ॥నన్నేలర॥
సదయ హృదయ! నీ-మృదుపదములు నామదినెరనమ్మితి మదనజనక ॥నన్నేలర॥
గరుడగమన ! నీ మరుగు జేరితిని-కరుణజూడు మోకంజదళాక్ష! ॥నన్నేలర॥
భాసమానదరహాస నల్లూరి రంగదాస హృదయ నివాస ! వేగమే
॥నన్నేలర రమాపతే॥

హిందుస్థానీ - కాఫీరాగం - అదితాళం

17] మ్యోనము జేసెదేర! మోహనాకార ! దోసిలొగ్గిననను గాసిబెట్టుచుయింత ॥మో॥
జలజనయన ! నిను శరణనివేడితి చలముబూనియు ననుసరగునబ్రోవర ॥మో॥
కరివరునేలిన కరుణయిప్పుడే మరుగున జేరెను మాధవ, శ్రీధర! ॥మోనము॥
వాసిగ భావపురివాస : నల్లూరి రంగదాసపోషక శ్రీశ! వాసవవందిత ॥మోనము॥

హిందూస్థానీ - కాఫీరాగం - అదితాళం

18] కౌసల్యాసుత రఘునందనా! వాసిమీరిన సేతుబంధనా ॥కౌసల్యా॥
వాలి మహాబలశాలిని నీ వొక కోలను భువిబడగూల్చిన ॥కౌసల్యా॥
శరణనుచు విభీషణుడు నిన్వేడిన స్థిరముగ రాజ్యమేలజేసిన ॥కౌసల్యా॥
దశకంఠుని-ఉద్దండత్రుంచియు-దిశలు విశదముగ నేలిన ॥కౌసల్యా॥
ధరను నల్లూరి రంగదాసహృత్సదన ! వరద! బాపట్ల పరిపాలనా! ॥కౌసల్యా॥

హిందుస్థానీ _ కాఫీరాగం - అదితాళం

19] రఘువీరా! శ్రీవరా ! అఘవిదూర అజహరవందిత ॥రఘువీరా॥
మారజనక ! తానేరము లెన్నుట-మేరయటర! నినుగోరివేడితి- ॥రఘువీరా॥
అపరాధిని నా నెపములెన్నకను కృపజూడర ! యీ కపటంబేలర! ॥రఘువీరా॥
వాసిగ భావపురివాసా! నల్లూరి రంగదాస పోషక ! ననుగాసిబెట్టక ॥రఘువీరా॥

ఖమాచిరాగం - అదితాళం

20] నన్ను బ్రోవవె శ్రీ రఘురామా ! నిను నమ్మితి సద్గుణధామా !
అను దినమును దలచితిరా ! నా మనవి చేకొనవిదియేరా ॥నను॥
నీ మృదుపదములె నమ్మియుంటి-కామసుఖము లెడ జిమ్మి ॥నను॥
నీ సరి వేల్పికలేరీభువి - దోసి లొగ్గితివేసారి ॥నను॥
పొంగుచు బాపట్ల యందు వెలసి రంగదాసుని బ్రోచితివిందు ॥నను॥

అరభిరాగం _ అదితాళం

21] జగదభిరామా! జానకిరామా! నిగమగోచరనామా! నిజభక్తజనకామా! ॥జగ॥
నీరదనిభగాత్రా! నిరుపమచారిత్రా! సారసదళనేత్రా! సన్మౌనిజనమిత్రా! ॥జగ॥
మందరగిరిధర! మదినిన్నెనమ్మితిర! ఇందిరామనోహర! ఇందువేగమెరార! ॥జగ॥
భావపట్టణవాస! భవహరోల్లాస! భావజరిపుతోష! పాలితరంగదాసా! ॥జగ॥

హిందుస్థానీ-కాఫీరాగం_అదితాళం

22] ఏ మని దెల్పుదునే మనసా ! రాముని మరచిన పామర నరులకు ॥ఏమని॥
సామిని మనమున ప్రేమతో దలచక నీమముచెడిన యానిర్భాగ్యులకునే ॥ఏమని॥
శ్రీపతి పదములె ప్రాపని నమ్మక యేపుమిగిలినట్టి పాప జనంబుల కేమని
వరరంగదాసుని స్థిరముగనేలిన ధర భావపురీశుని స్మరణ జేయని వారి
కేమని దెల్పుదునే.

దర్బారురాగం - ఆదితాళం

23] రవివంశజుడైన రాముని దలచక। భవము జెందగ నేటికె॥
భువనరక్షకుడైన, పుండరీకాక్షుని । సవినయముగ గొల్వవేమనసా ॥రవి॥
రాక్షసాధిపుడైన। రావణాసురుని నిర్లక్ష్యముగను నెంచి
తీక్షణంబగు బాణశిఖిచే। తక్షణం బెహతం బొనర్చి
సాక్షాత్కరించిన। సుభగచరితుని రక్షణముగోరవె । మనసా ॥రవి॥
రంగుగ నల్లూరి రంగదాసహృదయ। రంజన మొనరించి।
మంగళాంబనుకూడుకొని శృంగారముగ శ్రీభావపురిని చెలంగుచుండు
రథాంగపాణుని చెంగటనుజేరి మనుమ మనసా ॥రవి॥

హిందుస్థానీ కాఫీ - ఏకతాళ

24] రామా। యనియనవే మనసా । అప్పుడేమి గోరినను। ప్రేమతో నొసగు ॥రామా॥
కరిప్రహ్లాదులను-ఎంతో కరుణను గాచిన పరమపూరుషుని-రామా
మేటి దానవులను బట్టి, గీటణగించిన హాటకచేలుని ॥రామా॥
తాపస, సద్బృందము, భువి కాపాడుచుండెడి ఆపద్బాంధవుని ॥రామా॥
రంగుగ బాపట్లను చెలంగుచు నల్లూరి రంగదాస పోష। ॥రామా॥

ఝంఝూటిరాగం - ఆదితాళం

25] రారాఓ రాఘవా। సారసదళనేత్ర। సన్మౌనిజనమిత్ర। పోరాటమేలరా। ॥రారా॥
రాతి నాతిగ జేసి ఖ్యాతి చెందినయట్టి నేతవు నీవేరా। ॥రారా॥
నిక్కము నీ పద। నీ రజములునే । దిక్కని నమ్మితి ॥రారా॥
వాసిగ బాపట్లపురనివాస రంగదాససుపోషక। ॥రారా॥

శంకరాభరణం - ఆదితాళం

26] భజరే శ్రీ కృష్ణం-హేమానన ః భజరే శ్రీ కృష్ణం ॥భజరే॥
అజముఖవినుతం అద్భుతచరితం-సుజనార్చితనవసుందరభరితం ॥భజరే॥
సనకసనందన సన్నుతిఘోషం కనకాంబర సముజ్జ్వల భూషం ॥భజరే॥
పాపహరణ పటుచరణ సరోజం-గోపీ జనసన్నుతరవితేజం ॥భజరే॥
స్థిరముగ బాపట్లపుర నివాసం వరరంగదాసహృదయోల్లాసం ॥భజరే(శ్రీ)కృష్ణం॥

ఖమాచిరాగం - ఆదితాళం

27] భావజరిపునుత ః హితమృదుచరణా ః భవదనుజమదహరణ ః ॥భావ॥
పావనాంగ ః నవపంకజసమముఖ భవ్యచరిత ః సద్భక్తజనవరద ః ॥భావ॥
మునిజనవిమల హృద్వనరుహభవ్యనివాసా ః హాసా ః
మోహనరూప విమోహిత చిన్మయ భాసా ః ఘననిభనిర్మలకాయా ః
శుభకరణ ః కనకవసన ః ఘనకౌస్తుభా భరణ ॥భావ॥
అండజవాహా ః నీ దండ జేరితిని శ్రీశా ః ఈశా చండకిరణ శత కోటి
సదృశ ః సుప్రకాశా ః పండితజనసత్ఫలదాయక ః
వేదండ రక్షయాఖండల రిపు శిక్ష ॥భావ॥
స్థిరముగ శ్రీ భావపురవర ః నిత్యవిహారా ః ధీరా ః సురుచిర మణిమయ ః
శోభితగ్రైవేయహారా ః ధరను నల్లూరి రంగదాసహృత్స్థలన ః
నిరుపమానసువినిర్మల గుణ గణ ః ॥భావజరిపునుత॥

పరజురాగం - ఏకతాళము

28] పిలచితే పలుకవదేలర? నా సామిగ ః సలలితమగు త్వచ్చరణములే
నమ్మితి ॥పిలచితే॥
శరణనువారల కరుణను గాతునని బిరుదువహించిన దొరవటరా ః
నిరతము నిన్నే మది నెర నమ్మియుంటి వేగ ॥పిలచితే॥
ధరలో బాపట్లపురి ధామ ః యిటుల దాసవరులనేచగ నీకు తగునటరా ః
వరరంగదాసార్చిత ః గురుతరధీర ః వేగపిలచితే ః పలుకవదేలర సామిగ ః ॥నమ్మితి॥

బేహగ్‌రాగం — రూపకతాళం

29] పంతమేలరా నాసామి: దంతిరాజ వరదా: నీదు: చెంతజేరి యుంటినాతో ॥పంత॥
ఆపద్బాంధవుడవని ప్రాపుగోరి యుంటిరా।
కోపమేల జేసెదురా: గోప బాలక : నా సామి: ॥పంతమేలరా॥
ఎన్నరాని జన్మములను। యెత్తివేసరి యుంటిరా : కన్నతండ్రి :
నన్నుబ్రోవ కరుణ జూడరా : నా సామి : ॥పంతమేలరా॥
వాసిగ బాపట్ల పురనివాసా : నల్లూరి రంగదాసు
నేలినాడవని దోసి లొగ్గితి నా సామి : ॥పంతమేలరా॥

హిందూస్థానీ - కాఫీరాగం - ఆదితాళం

30] దేవకినందన : దయానిధే : దీనదయానిధే: దీనదయానిధే :
భావజరిపునుత : భక్తసుసేవిత : ॥దేవకి॥
తాపసపోషణ : దానవహరణా : ఆపద్బాంధవ : నాయపరాధమెన్నకు ॥దేవకి॥
శరణనువారలపరగున బ్రోచెడి బిరుదుగల్గిన తండ్రి మరువకునన్నెపుడు ॥దేవకి॥
స్థిరముగ బాపపురమున వెలసియు ధరను నల్లూరి రంగదాసుని బ్రోచిన ॥దేవకి॥

బేహగ్ — ఆదితాళం

31] నామనవినవేమిర: సామిగ: పామరుడనని, ననుబాములబెట్టుటమేలరట॥నామనవి॥
దాన వీరులనెల్ల మానకద్రుంచిన యట్టి గానలోల : నిను
మది ధ్యానము జేసెదవేగ ॥నా మనవి॥
దాసజనుల నీవు వాసిగ బ్రోచకిటుల మోసము జేసినయా
దోస మెవ్వరిది వేగ ॥నా మనవి॥
అందముగ శ్రీ బాపట్ల యందు నెలకొనిన ఓ ఇందిరేశ :
రంగదాసు నింపొంద నేలితివట ॥నా మనవి॥

బిలహరిరాగం — ఏక చాపుతాళం

32] నిన్నే నమ్మితి నీరజాయతాక్ష : పన్నగాశన : పంతమేల నా తో ॥నినే॥
పతితులనెల్ల పావనులజేసి–మితిలేని మోక్ష మిచ్చు దాతవని ॥నిన్నే॥
సరసిజభవసన్నుత: సువేష: పరమాత్మ: నాదు బావమందుగోరి ॥నిన్నే॥
ధర బాపపురి ధాముడవగుచు–వరరంగదాసవరదుడ మది ॥నిన్నే॥

సురటరాగం — ఏకతాళం

33] విరానను బ్రోవరా : పరాకేలర : ధరారమణ : నా మొరాలకించవేర : ॥విరాన॥
సరసిజభవ: భవసన్నుత: పదయుగ: సురుచిరరూప: నీ మరుగుజొచ్చితివేగ ॥విరాన॥
అనుదినము నినుమనమున నమ్మితి: కనికరమున బ్రోవు గరుడగమన వేగ ॥విరాన॥
పొంగుచు శ్రీభావపురమున నెలకొని రంగుగ నల్లూరి రంగదాసనుత: ॥విరాన॥

హరికాంభోజరాగం చాపు

34] మరుజనకా : నిన్నె మది మరువకుంటిరా : కరివరదా : నన్నువేగ కరుణనేలరా :
నీదు పాదసేవకుడను ఆదరింపరా : వాదమేల వేగనాదువాంఛదీర్చరా ॥మరు॥
పంతమేల నాతో నీకుభక్తపోషకా: సంతసమున నన్నుగావ సమయమిదేరా॥మరు॥
వాసిగ నల్లూరి రంగదాసపాలనా : భాసుర శ్రీభావపురీ భవ్యఖేలనా: ॥మరుజనకా॥

శ్యామరాగం — అటతాళం

నా మొరాలించవదేమి సామి-కామజనక: నన్ను కరుణించవేమి ॥నా మొరా॥
ఆ పన్నులనెల్ల కాపాడేదేవ : మాపాలి దైవమా ప్రాపు నీ వేరా: ॥నామొరా॥
ఎన్నెన్నొ జన్మములెత్తి వేసరితి కన్నతండ్రి: నన్ను కడతేర్చవలెరా ॥నా మొరా॥
పంతగించుటమేలా: భక్తపరిపాలా : చింతలెల్లదీర్చు శ్రీరమాలోలా ॥నామొరా॥
ధరలోన శ్రీభావపురమున నెలకొని-వరరంగదాస హృద్వనజనివాసా: ॥నామొరా॥

ఝుంఝుటిరాగం — ఆదితాళం

36] నమ్మితి నమ్మితిరా : నీ పాదములు సమ్మతితో నెరనమ్మియుంటి నిను
కమ్మవిల్తునిజనకా : నా పాలికిపమ్మ మమ్మేలు కొనరా: ॥నమ్మితి॥
తప్పక నీ నామ మెప్పుడు దలచెద- అప్ప: నన్నేలుకోరా :
నా పాలిటి ఒప్పులకుప్పవురా : ॥నమ్మితి॥
ధరభావపురివాస : దాసజనోల్లాస : వరరంగదాసపోషా :
అమరముని వందిత చిద్విలాస : ॥నమ్మితి॥





శుద్ధకాంభోజరాగం — ఝంపె

37] పవళించు శ్రీ భావదేవ ! పర్యంకమునను
సవినయముగ భక్తజనులు గొల్వగను ॥పవళించు॥
ఇందువదనలు వీణెలింపుగా మీటుచును
అందముగపాటలందంది పాడగను
కుందనపు తొట్టిలో కోరికలలరగను
మందరోద్ధార శ్రీమానినీ మణిని గూడి ॥పవళించు॥
పడమిముద్దియ మంచి విడెములందివ్వగను
అడుగులొత్తుచు నీళ అమరియుండగను
కడువేడ్కతోడ నపకంజదళనయనా ! నీ
వడుగడుగునకు శర్కరారగింపుచును ॥పవళించు॥
వాసిగను బాపట్లవాస ! నల్లూరి రంగదాసుడర్ఘ్యంబివ్వ
దయతో గ్రహించి భూసురాశీర్వాదములుజెలంగ
చిద్విలాసములు చూపుచును—లావణ్యముగను పవళించు శ్రీభావదేవ !

నవరోజురాగం

లాలి శ్రీరాజ్యలక్ష్మి మనోహరణా ! లాలికౌస్తుభాభరణ ! లావణ్యవదనా ॥లాలి॥
బంగారుతొట్లలో-బాగొప్పగాను-మంగళాంబను గూడి మనసు దీరగను
శృంగారవతులెల్ల పాడగను మంగళాకార ! మమ్మేలు దయతోను ॥లాలి॥
కాంచనాంబరధర ! కమనీయహారా ! పంచశరసుకుమార ! భవభయవిదూరా!
అంచిత సుగుణజాల! ఆర్యమందార! కాంచనాద్రిసుధీర! శరధివిహారా! ॥లాలి॥
భాసురబాపట్ల వాస ! దరహాసా ! భావనారాయణ ! భక్తజన పోషా !
వాసవార్చిత దివ్యపై భవోల్లాసా ! వరరంగదాస వందితచిద్విలాసా ! ॥లాలి॥



రేగుప్తి రాగం — ఆదితాళం

39] జోరమ్యగుణధామ ! జోదనుజభీమా !
జోనీరదశ్యామా ! జోభవవిరామా ! ||జో జో||

చందనంబలదిన చారుయురమునను
అందముగ నవ పుష్పహార మొప్పగను
ఇందువదనముగ నానందమ్ముగాను
పొందుగ కస్తూరి బొట్టు మెరయగను ||జో జో||

నిలువుటద్దంబులు నలుగడలయందు
వెలయగను మీ సేవ విశదముగనందు
చెలువమలరగ మేము సేవించి ముందు
నిలచియుంటిమి బ్రోవు నెనరుంచియిందు ||జో జో||

పదియారు వన్నె బంగరు తొట్టెలోను
మదనజననియు నీవు మరిహాయలుగాను
సదయులై యొప్పితిరి సౌఖ్యమొందుచును||
సుదతులు వేడ్కతో కలిసి పాడగను ||జో జో||

పొంగుచును బాపట్ల పురమున నీవు
మంగళాంబను గూడి - మరి వెలసి నావు
బంగరుచేలా! సద్భక్తులనుగావు
రంగదాసుని బ్రోచిరంజిల్లినావు ||జో జో||

శుద్ధకాంభోజరాగం  ఆదితాళం

40] మంగళంబని పాడరారమ్మ ! జగదీశునకు ! ॥జయ మంగళం బనిపాడరారమ్మ॥
రంగు మీరఖగరాడ్తు రంగునకు జయ జయ మంగళం!
శృంగారపతులు మీరు రంగైన బంగరు పళ్ళెరంబుల పొంగుచు
శుభమంగళమనుచుపాడ అంగజ జనకుడు
కృపాంగుడై చెలగి జగన్మంగళముగను శ్రీచురంగనికి మంగళం॥జయ మంగళం॥

సుందరాంగులార ! మీరు అందములలర గోవిందుని
పాదములందు డెందము పొందుపరచి అందమొందగ పాటలంది పాడుచు
శ్రీసుందరాంగుడగు మన ఇందిరేశునకు మంగళం ॥జయ మంగళం॥

రాజముఖులార! మన రాజీవదళనేత్రుడు రాజ్యలక్ష్మితో గూడి
రంజిల్లుచున్నాడు శ్రీరాజీవాసవాది సుర రాజ రాజ రాజ -
మహారాజశేఖరమకుట రాజితాంఘ్రునకు మంగళం ॥ జయ మంగళం॥

బావపట్టణమునందు భక్తులబ్రోచెడి శ్రీ బావదేవునకు
నిజభక్తుడగుచు నొప్పుసావధాన రంగదాసాఖ్యతోటి
ధాటిగాను బావమలర ఇపుడు భక్తిముక్తిమెరయ మంగళం ॥జయ మంగళం॥

కేదారగౌళరాగం — చాపు

41] యాదవకులమున మోదమలరగను
యశోదనందులకు సుతుడవగుచు
వాదించి పూతనవచ్చి పాలివ్వగ
భూధరమున దాని భువిపైన గూల్చిన ॥కృష్ణా-మంగళం మంగళం॥

శకటమొకటి ఘోరతరమగుచుని
న్నొక్కని గొనిపోవ యర్భకుడవగుచు
ప్రకటితముగ వామపాదముననుదన్ని
వికలముజేసిన విశ్వాత్మక! కృష్ణా! ॥కృష్ణా-మంగళం మంగళం॥

దనుజుడొకడు మహానిలమగుచు వేగ
ఘన మార్గమున నినుగొనిపోవగా
మనమున కోపము బెనగొన తత్కంఠ
మునుకరమున బట్టి భువిపై గూల్చిన ॥కృష్ణా॥ మంగళం మంగళం॥
గోపి కలెల్లరును గూడి యశోద మీ
పాపడు మా యిండ్ల పాలూ-పెరుగూ
ఈపట్ల మన నీయడిక నాజ్ఞసిమము
కాపాడుమమచు మీ ప్రాపే గోరిన ॥కృష్ణా-మంగళం మంగళం॥
మన్నుదినె సుమీ వెన్నుడనుచు చెంత
నున్న బాలురు దెల్ప నోరి కుట్టు ।
మన్ను దింటివ నీదు చిన్న నోరు జూపు
మన్న దల్లికి విశ్వమంత జూపిన ॥కృష్ణా మంగళం మంగళం॥
ఉట్టి మీద నున్న చట్టిలో మీగడ
పొట్టి నింద మెక్క నట్టి తల్లి
బట్టి నిన్ను రోటగట్టి వేయగ చాల
చిట్టపై మద్దుల దిగువ ద్రోచిన ॥కృష్ణా మంగళం మంగళం॥
రంగు మీరగ గోపరమణుల వలువలు
దొంగిల యతి త్వరతోడనేగి
చెంగట నొక పొన్నచెట్టెక్కనంతనా
యంగన లెల్లరునతులొనర్చిన ॥కృష్ణా॥ మంగళం మంగళం॥
ప్రేమ రుక్మిణి సత్యభామ లిరువంకల
నామోదించగ నభిరాముడవై
కామ జనక రత్నఖచిత సింహాసన
ధాముడవై నట్టి ధర్మపాలన ! ॥కృష్ణా-మంగళం మంగళం॥
విరిపిగ బాపట్ల పురమున నెలకొని
స్థిరముగ సద్భక్త వరదుడవై
ధర నల్లూరి రంగదాసార్చితదివ్య
వరవై భవోజ్జ్వల పరమ పురుష ! మాధవా! నీకు ॥కృష్ణా॥ మంగళం మంగళం॥

* * *

బిలహరిరాగం — చాపు

42] హారతులిపుడివ్వరే ! శ్రీరమామణికి హారతులిపుడివ్వారే
సారసాక్షులువేడ్కను కోరికలు మీరంగను
చారుతరసౌందర్యశాలికి శాంత సుగుణాళికిని ॥కర్పూర హారతు॥
సారసదళ నేత్రికి సాధుజన సన్నుతసుచరిత్రకు
నీరదాభవేణికి నిఖిలసుగుణ శ్రేణికి
తారహారవిభూషణాంచిత ధర్మ సంవర్ధనికి ॥కర్పూర హారతు॥
భావదేవునిరాణికి భక్తజనపాలిత వీక్షణికి
శ్రీవి జెందిన దేవకీ సేవక జనామోదికీ
పావనాంచితగాత్రికి సత్పరమపావిత్రికీ ॥కర్పూర హారతు॥
రంగుగ బాపట్లను వెలసిరంగదాసునికృపను
పొంగుచు రక్షించిన భువనములకతిమించిన
మంగళము లొసగుచును వెలసిన మంజుభాషిణికి ॥కర్పూర హారతు॥

పంతువరాళిరాగం

43] మంగళహారతూలివ్వరే - మా రాజ్యలక్ష్మికి మంగళహారతులివ్వరే
అంగనలందరు గూడి బంగరుపళ్ళెరములచే
సంగతులను మీరగ జయ మంగళహారుతు-లివ్వరే
జలజదళ విశాలనేత్రికి సల్లలిత సుమమిళితనీల వేణికి
మొలక నవ్వులు మోమునందు గులుకగ భక్తజనులకెల్ల
కలుములు దయచేసి బ్రోచు కలికికి మెరుములికికి ॥జయ మంగళ హారతూ॥
సురముని జనకల్పవల్లికి శుభచరిత్రకు
వరమణి భూషణ ధరాంగికి నిరుపమకటాక్షమునను
నిఖిలజనంబులనుగాచు పరమాత్మునిరాణికి
నవపల్లవమృదుపాణికి జయ మంగళహారుతులివ్వరే ॥జయ మంగళ హారతూ॥
ధరలో బాపట్ల పురమున స్థిరముగ వెలసి వరములు దయ చేయు తల్లికి
మరువక పదకంజములను మనమున నెరనమ్మియున్న
వర నల్లూరి రంగదాసపాలికి; గుణశాలికి హారుతులివ్వరే ॥జయ మంగళ హారతూ॥

బిలహరిరాగం — ఆదితాళం

44] హారతులివ్వరే మన అంజనీదేవి కుమారునకు ॥హారతు॥
చారుకర్ణ విభూషనకు స్వర్ణయజ్ఞపవీతునకు
సద్గుణధామునకు కర్పూర హారతులివ్వరే
సామగాన విశారదునకు సాగరసమ గంభీరునకు
రామనామపరాయణునకు-రామానుజప్రాణ సంరక్షణదక్షునకు ॥కర్పూర॥
సంగరవిభీషణునకు శాత్రవమద సంహారణునకు
రంగుమీర కృపాంగునకు-సంగతులు మీర కపికులసార్వభౌమునకు ॥కర్పూర॥
భాసుర బాపట్ల పురనివాసునకు-చిద్విలాసునకు
వాసవామరతోషునకు వాసిగ నల్లూరి రంగదాస పోషునకు ॥కర్పూర హారతులివ్వరే॥

ఆనందభైరవిరాగం — ఆదితాళం

45] బాల నిన్నే గోరి యున్నదిరా ! బాపట్లపురీఫేలన! జాలమేలరా !
చాలు చాలు దాని తోడ సరసముగా బలుకకిటుల
తాలిమిదూల జేసెదిది మేలరయక చాలుర
పసిబాలను ఇపుడేలర ! సామి ॥బాలనిన్నే॥
ఇంతి దంతి రాజగమన రామేల్ చనులు పూ
బంతుల నగవంతు కెక్కురా సంతసపడ నగూడి నీవు
సరసరతుల నేలుము ఓ కంతు జనక దాని నోయగ
మెంతుమురామంతనమున సంతతమును వంతుకెక్క ॥బాలనిన్నే॥
చారు నీరదవేణిరా శహబాసుబల్ వయ్యారి బంగరుగేరుమేనురా
మీరు పన్నగమును నూగారుతీరు వారిజాక్షికి
మారుని సమాన సుందరా-కారుడవని
ధీరుడవని శూరుడవని-జారుడవని ॥బాలనిన్నే॥
ఆసతో నిను నమ్మి యున్నదిరా శ్రీ భావ దేవగానిజేయుట
వాసిగాదురా ! వాసవసుత చిద్విలాస !
వర నల్లూరి రంగదాసపోషక ! దరహాస ! శ్రీశ
వాసిగ నీవానపడిన దాసుల బ్రోవనీ సమయమే ॥బాలనిన్నే॥



ఆనందభైరవిరాగం — వప్పగింతలపాట

47] శ్రీ జానకీ రమణ ! శీతాంశువదనా !
పూజితమునిజన ! భువనమోహన ! లక్ష్మీ కల్యాణ వైభోగమే !
ఇనకులాంబుధిసోమ - ఇపుడు జనకజను
ఘనముచేపట్టి-కరుణించుదయను ॥లక్ష్మీ॥
కొమ్మ ! ముద్దుల గుమ్మ ! గుణవతియు సుమ్మ!
నెమ్మది బోషించిన నీకె సత్కీర్తి ॥లక్ష్మీ॥
ఏమి యెరుగదు మబలనెట్లు జూచెదరో
ప్రేమతోడుత మేము - బెంచితిమయ్యా ॥లక్ష్మీ॥
పతితపావన! జగద్భర్తమాసుతకు
పతివౌటకిపుడు మా భాగ్యమేమందు ॥లక్ష్మీ॥
ఇంతులలోనమేల్ బంతి! మా చెలీ
సంతసమున బోషివు సౌఖ్యము లొసగ ॥లక్ష్మీ॥
కూరిమితోడ నీ కోమలిని మీరు
ఏరీతిగాతురో ! మారాడవెరచు ॥లక్ష్మీ॥
అల్లుడవు నీవు మాకయినందుమూలాన
యల్లమురంజిల్లెనో ! సుగుణా కార ! ॥లక్ష్మీ॥
నీకు దెలియని ధర్మ మెందుగలదిలను
ప్రాకటముగా బోషిచే భారము మీది ॥లక్ష్మీ॥
నెయ్యమున సీత నేలు కొమ్మమచు
చయ్యన చేతిలో చెయ్యప్పగించి ॥లక్ష్మీ॥
అవ్వల తలిదండ్రులాసీత తోడ
పువ్వుబోణిరో నీవు పోయి వచ్చెదవా ! ॥లక్ష్మీ॥

అత్తమామలయందు అతిభక్తి గలిగి
వర్తించు మాయమ్మ వాసి మీరగను ॥లక్ష్మి॥
బావల మరుదుల బాగుగా జూడు
భావమందున పతి భక్తినే మరకు ॥లక్ష్మి॥
ఆడుబిడ్డలతోడ నతి స్నేహమునను
గూడియుండగదమ్మ కొమరుమీరంగా ॥లక్ష్మి॥
తోడి కోడండ్రతో మెలగియుండు
ఱడుచేడియలతో నేగకు మెప్పుడు ॥లక్ష్మి॥
దాసీజనంబుల దగ్గ్రబోవుమమ్మా
బాసిలు సత్కీర్తి పరగజేయుము ॥లక్ష్మి॥
అనుచుబుద్ధులు చెప్పి యా సీత తోడ
కనులను సద్బాష్పకణము లొల్కగను ॥లక్ష్మి॥
మామకు నత్తలకు మరియప్పగించి
ప్రేమనిక నెవరిని బిల్తు మాయమ్మ ! ॥లక్ష్మి॥
కలికిరో! మా యింట చిలుకలటునెల్ల
పలుకులు చెప్పేటి బాలఖంకెవరా ॥లక్ష్మి॥
అపుడు చెలులందరు నాసీత తోడ
ఎపుడుజూతుమొ నిన్ను యిందీవరాక్షి ॥లక్ష్మి॥
వనిత కీరితిని వగచు చుండగను
జనకుడు సీతకు సమ్మతి తోడ ॥లక్ష్మి॥
విత్తముదాసీల వేడ్కతో నిచ్చి
అత్తవారింటికి పంపించిరపుడు ॥లక్ష్మి॥
ధారుణిబాపట్ల ధాముడీ భావ
నారాయణుని కృప నతిభక్తితోడ ॥లక్ష్మి॥
రంగున నల్లూరి రంగదాసకవి !
శృంగారముగ జెప్పి చిత్తమలర ॥లక్ష్మి॥
ఘనమగు నీ పాట వినిన జదివినమా
వనమాలికృపగని వర్ధిల్లురిలనూ ॥లక్ష్మి॥

రేగుప్తిరాగం  రూపకం

47] శ్రీభావపురధామా ! శ్రితజనకామా !
ప్రాభవాభి శోభిత సద్భావ! హెచ్చరిక,
అంభోజ దళనేత్రా అర్యవినుత పాత్రా!
కుంభజ ముఖముని పూజిత గుణవర ! హెచ్చరిక,
వందితవరముకుందా ! వరదగోవిందా !
మందరగిరిధర సద్గుణసాంద్రా ! హెచ్చరిక
సురచిరమణిమయభూషా ! సుందరతరవేషా !
సురమునిగణ పోషా ! సువిలాసా ! హెచ్చరిక
కాంచనవరవస్త్రదుచేలా ! కౌస్తుభమణిమాలా!
అంచిత సద్గుణజాలవిలోలా ! హెచ్చరిక
కాయజ శతసుకుమార ! కమనీయకపోలా !
శ్రీయుతసద్భావ నారాయణ ! హెచ్చరిక
సరసిజోద్భవ వందిత చరణా ! భవహరణా !
వరనల్లూరి రంగదాస వరదా! హెచ్చరిక॥

సురటరాగం — అటతాళం

48] మంగళం శుభమంగళం శ్రీరాజ్యలక్ష్మి కాశ్రిత కల్పవల్లికి
మంగళం శుభమంగళం॥
చారుసద్గుణ ! సుప్రశస్త వైభవకును ॥మంగళం॥
శాంతశమాద్యనంత సుగుణపరిపూర్ణకు స్వర్ణవర్ణకు ॥మంగళం॥
అష్టవిభూతి ప్రదాయియైనవరనేతకూ విఖ్యాతకు
శిష్టజనస్తుత జితశశివదనకు ॥మంగళం॥
రంగుగ నల్లూరి రంగదాస కవి పోషికిమృదుభాషికి
పొంగుచు బాపట్లపురవరసదనకు ॥మంగళం॥

తలుపుదగ్గరపాట — గౌరిపంతువరాళిరాగం

శ్రీలక్ష్మీసరసీరుహాక్షి ! నను చేకొన వాకిలిదియ్యావే !
నీ చెంతకు వేగరానియ్యావే !
శ్రీలక్ష్మీందుకు చేకొనుటెందుకు చెంతకురావని యేమి
ఆ చెలని గూడు పోసామీ !
ఏ సుదతిని నేనెరుగ, నిప్పుడు దాసుల బ్రోచి వచ్చితినే
ఏ దోసం బేనెరుగనే !
దోసములేదనయె సతి నమ్మ నీ వేసములిక చాల్ చాల్
నీ వెంత వాడవనజాలు –
ముద్దుగొల్కు నీ మోమిటుచూపి నా ముచ్చట దీర్చవె కొమ్మా !
నవమోహనాంగి చేకొమ్మా !
ముద్దులేలనాతో ముచ్చటేల ఇక వద్దులాడకను పొమ్మ
నా వద్దకేల పోపొమ్మ
ముచ్చసోమకుని మునుజంపిన యా మత్స్యమూర్తినేభామా !
నాతో ముచ్చటాడవే లేమా !
మత్స్యమవైతే మంచి జలములను యిచ్చగ దిరుగగదోయి !
నాతో ముచ్చటేల పోవోయి !
కమఠరూపమునుగైకొనిమున్నా సుమనసులనుగాచితినే
ఓ సుందరి పంతముమానె
కమఠుడవైతే రమణులపైనిటు భ్రమలేటికి జెందుదువు
ఓ వారిజనేత్రా ! నీవు
ఘనకిటిరూపముగైకొని నేనాకనకాక్షు నిర్దుంచితినే !
మించినఘనతను జెందితినే !
ఘనకిటిరూపము గలిగితె నిప్పుడు వనమున దిరుగగదోయి !
నాతో వాదమేల పోపోవోయి !
హిరణ్యకశిపుని సరగున ద్రుంచిననరసింహుడనే భామా !
నన్నాదరించవే లేమా !
హరిని జూచినను వెరతురు జనములు గిరుల చెంతకునుబోయి
సుస్థిరముగ నుండగ దోయి !

శ్రీ మంతుని బలి భూమిని డొక్కిన వామనమూర్తినె కొమ్మా ॥
నను ప్రేమ మీర చేకొమ్మా ॥
వామనుడవు నీవైతే నిప్పుడు పేమరు బల్కక పొమ్మ
బహువిధిని వేగవేడుకొమ్మ
ధరను క్షత్రియులను పెరువక దుంచిన పరశురాముడనే రామా ॥
నన్నెరుగవముఖజిత సోమ ॥
పరశురాముడనబరగి క్షత్రియుల బరిమార్చుట బాగౌను
నాతో పలుమరు దెల్పుట మాను
రావణ కుంభకర్ణాదుల దుంచిన రాముడనే నేగానా
శ్రీరాముడనే వోచానా ॥
రావణ హరణము నీవే జేసితే భూవలయమున వటించు
వరముని జనముల పాలించు
ఖలులగు, కంసాదుల, ఖండించిన, బలరాముడ నా యందు
యిక వాదము మానవె యిందు॥
బలరాముడనా బరగితే శత్రుల ఖండనమున దుంచుము
నను బలుకరించుటికమాను
ఇద్ధరలోనే నింపుమీరగను బుద్ధరూపుడమగాన
ఒక ముద్దు బెట్టవేచాన ॥
బుద్ధ రూపుడవ పొలు పొందితె యా బౌద్ధులగావగదోయి ॥
నా వద్దకు రావలదోయి ॥
ఇలలో దుర్జనముల ద్రుంచెడి యాకలికిమూర్తినేభామా ॥
ననుకలయగ నివ్వవె లేమా ॥
కలికిమూర్తినిమ గలయగరాదికవలగలేల పోవోయి ॥
నీ వచ్చిన త్రోవనె పోవోయి ॥
ధారుణి బాపట్లధాముడనౌ భావనారాయణుడను నేనూ
పదనళినములకు మ్రొక్కెదను
ధారుణి బాపట్లధాముడ నీవిటు చేరగరాగదవోయి ॥
ననుజేరి బ్రోవగదవోయి
పొంగుచు నిరువురు రంగదాసుని చెలంగుచు బ్రోచిరి వేగ
కృపాంగులగుచును బాగా.

శ్రీహరినామ కీర్తనలు సంపూర్ణము



# కొట్నాలపాటలు

బేహగ్ — ఆదితాళం

సువ్వి సువ్వి సువ్వియని సుదతులెల్లపాడరే
చివ్వునా మీరెల్ల వేడ్క చేతానిందుగూడారే ॥సువ్వి॥
పంచశరుని శరములన మించి సంతసంబునా
చంచలాక్షులారా? మీరు మంచి కృతులచే ॥సువ్వి॥
హస్తమున రత్నకంకణాదుల ధ్వనులెసగగా
ప్రస్తుతులొప్పగ వేడ్క బంగరురోకళ్ళచే ॥సువ్వి॥
జీలకర్రరాజానములు చిటి చిటి ముత్యాలుగానూ
చాలా మదిరంజిల్లగానూ సఖియాలెంతో వేడుక ॥సువ్వి॥
సన్నకుసుమాలనూ మంచి సంబావూలానునిచియూ
పున్నమాచందురుబోలు మోములా చిరునగవులా ॥సువ్వి॥
రాజభోగామూలు మంచి రమ్యమౌధాన్యంబులూ
రాజీవాక్షులెల్లానునిచి రంజిల్లుచుండ ॥సువ్వి॥
వాకాలు మొలకొలుకు లెంతొ వాసియౌధాన్యంబులు
ప్రాకటముగదంచిరెల్ల పడతులుల్లసిల్లుచూ ॥సువ్వి॥
ముదముమీరగాను యెంతో ముచ్చటలు బల్కుచూ
వదలకా నొకరికొకరు వాంఛామీర బాడుచు ॥సువ్వి॥
స్థిరముగ బాపట్ల భావదేవా నీ మదిదలచుచూ
ధరణిలో నల్లూరి రంగదాసాకవికృతి నెన్నుచు ॥సువ్వి॥




సంతువరాళి

సువ్వి సువ్వియనుచు పాడరే సుదతులెల్ల ॥సువ్వి॥
సువ్వి సువ్వియనుచు పాడరే సుందరాంగులెల్లముదము
నివ్వటిలగాను యెంతో నేర్పులుల్లసిల్ల గూడి ॥సువ్వి॥

కనకపీఠములయందు ఘనముగదంపతులనునిచి
మనములలరగాను యెంతో మంచి మంచి కృతులు బాడుచు ॥సువ్వి॥

పమిడి గంపలందు ధాన్యసమతినునిచి వేడ్క మీర
కమలముఖులు ఘనతరోకండ్లుచేత బూనివేడ్క ॥సువ్వి॥

కరముల కంకణములెల్ల ఘనముగ మ్రోయగనెంతొ
మురియుచు సంతసము మీర పువ్వుబోణులెల్ల వేడ్క ॥సువ్వి॥

సకల ధాన్యములనుంచియు సరిగమ సుస్వరములచే
ప్రకటితముగ బాడిరెల్ల పడతులు మహోత్సవమున ॥సువ్వి॥

భాసుర బాపట్ల పురనివాసుడౌ శ్రీహరిని దలచి
వాసిగ నల్లూరి రంగదాసుని కృతిమడివి వేడ్క ॥సువ్వి॥



# ఎదురుకోలరాయబారము

హే జనక భూధవామాత్యులారా।

సీ॥ శ్రీకర రఘుకుల క్షీరాపాథోనిధి చంద్రుడౌ దశరథ చక్రవర్తి
నటవిటగాయక భటవర్గములు గొల్వ పుత్రమిత్ర కళత్ర బుధులతోడ
వేడ్కచే నయోధ్యవెడలి వివాహార్థమిచటికి విచ్చేసిరింపుమీర
మీ ప్రియపుత్రిక మేదినీసుతనిచ్చి వైభవం బలర వివాహమిపుడు
జేయ యత్నంబు సమకట్టు శీఘ్రముగను। వారినిచటి కాహ్వానింప వలయుగాన
వేగవేంచేయవలెనయ్య। విభవమలర। జనకభూపరుతో మీరు మనమలరగ॥

వ. రఘుకుల క్షీరపారావార పరిపూర్ణరాకాచంద్రుండగు శ్రీరామచంద్రుండు లక్ష్మణ సమేతుడై విశ్వామిత్రు వెనువెంటన్ జని దానవానీకంబులన్ ద్రుంచి గాధిసుతు జన్నంబురక్షించి మిథిలాపురమ్మున కరుదెంచి మిమ్మున్గాంచి మీ గృహంబున పూజలన్ గ్రహించి సీతా స్వయం వరోత్సవంబునందలి శివ శరాసనంబవలీల గేలన్ గీలించి ఎక్కిడి తద్ధనుర్భంగంబొనరించె నట్టి రామునకు మత్ప్రియ పుత్రికయగు సీతనిచ్చి వివాహంబుగావింప నిశ్చయించిన వారముగాన సపరివారముగా విచ్చేయుడని మీకలంపిన శుభలేఖన్ జూచి అయోధ్యాపురవరాధ్యక్షుండగు దశరథ క్ష్మావరుండపరిమితానంద కందళిత హృదయారవిందుడగుచు పుత్రమిత్రామాత్య బంధువర్గంబులతో నిచటి కరుదెంచియున్న వారలుగాన మీరును సపరివార సహితంబుగా శీఘ్రంబచటి కరుదెంచి సవినయ గౌరవంబుగా వారిన్ బూజించి తోడ్కొనిరండు.

హే దశరథరాజ చంద్రామాత్యులారా।

సీ॥ జనక భూమీశుండు ఘనముగ మిథిలాపురంబున రాజ్యంబుదంబుమీర
జేయుచు సత్కీర్తిచే జెలువొందుచు సత్యధర్మంబులు జగతియందు
నిత్యవ్రతంబుగ నెరపుచు ప్రజలను పుత్రులరీతిగ బ్రోచుచుండి
దుష్ట విగ్రహమున శిష్ట ప్రతిపాలనం బొనరించుచు నయముతోడ
సజ్జనులు తన్నుగొనియాడ సవనమొకటి జేయసమకట్టి భూసురశ్రేణితోడ
బయలుదేరియు పురబహిః ప్రాంతమునను। భూమిపరిశీలనము జేయబూనియపుడు.

వ. జనక భూవరుండట జన్నంబొనరింప నిశ్చయించి యజ్ఞశాలా ప్రదేశంబు లాంగలిచే దున్నింప నాహలాగ్రభాగంబునన్ దగిలిరత్నస్థగితంబగునొక్క సువర్ణ మందసంబు బయలువెడలెనంత, జనక మహారాజు తత్కవాట బంధమోక్షణంబు గావింపనందు కొక్కారు మెఱుంగు చందంబున నవరత్నస్థగిత ధగద్ధగాయమాన దివ్యభూషణ భూషితయై శ్రీమన్నారాయణునకు నిత్యానపాయినియగు ఆదిలక్ష్మి యోయన నొకబాలిక అందునన్ ప్రకాశించుచుండన్ గని యభ్భూవరుండు పేదకు పెన్నిధానంబు దొరకిన చందంబున నమందానందంబు డెందంబునన్ గ్రందుకొన తన సదనంబునకున్ గొని చని తనకుల సతికినొసంగి సీతయని నామకరణంబొనరించి యతిగారవంబునన్ పెనుచుచుండ నా సతీతిలకంబు శుక్లపక్ష శశాంకునివలె దినదిన ప్రవర్ధమానయై సౌకుమార్య చాతుర్య గాంభీర్య లావణ్యాది గుణ గరిష్ఠయై యొప్పుచుండె, నంత నాజనక భూపతి యాసుదతీమణికిన్ దగిన వరున్గానక నొకప్రతిజ్ఞ నొనర్చిన వారలచి యెద్దియనిన మద్వంశకర్తయగు నిమి చక్రవర్తి నాటినుండి మత్సదనంబునన్ గొదువలేని నిత్యపూజలందుచున్ బ్రకాశిలు బురహరు శరాసనంబీ భూమండలంబునన్గల రాజమండలంబున నెవ్వరెక్కిడుదురో! వారికి మత్కుమారికారత్నంబునొసంగి వివాహంబుగావించె దనని స్వయంవర మహోత్సవంబు చాటింపన్ జేయించియున్నవారలా కారణంబున నిచటికి శూరులగు రాకుమారులనేకు లరుదెంచి యా ధనువున్ బట్టినట్టిల్లు గదల్పజాలక పరాభవంబునొంది తమ తమ నగరంబులకరిగిన వారలనంతరంబు,

చ॥ దశరథ రాజనందనుడు తాపసి వెంటనువచ్చి యిచ్చటన్
పశుపతి కార్ముకంబు తన బాహుబలంబున నెక్కుబెట్టె నా
శశిముఖ సీతనాతని కొసంగుట నిశ్చయమైన వాని స
దృశ్యము, కుల ప్రభావము, గుణాతిశయంబులు దెల్పుడియ్యెడన్.

హే జనక భూవరా మాత్యులారా!

సీ॥ ధరలోన లోకబాంధవ వంశమునబుట్టె తాటకి మర్ధించి తపసి జన్న
మునుగాచె గౌతమమునిపత్ని పాషాణమైయున్న పదరజ మహిమచేత
పడతిగాజేసె తాపసివెంట మిథిలాపురమునకు నేతెంచి రహిజెలంగు
శివశరాసినమతి శీఘ్రతనెక్కిడి తద్ధనుర్భంగంబుదగ నొనర్చె
నిట్టిరాముని మహిమంబులెన్న పంచముఖ చతుర్ముఖ శతముఖ ముఖులకైన
దరమే! మానవులననెంత ధర్మసత్య రూపలావణ్య గుణముల రూఢికెక్క!

వ॥ లోకబాంధవుడనన్ బరగిన దినమణియన్వయంబున యశఃకాముండై యవతరించిన శ్రీరామచంద్రుని సామాన్యరాజన్యునిగా దలంచి మీరిట్టులుగ్గడించితిరిగాన నమ్మహాత్ముని వంశప్రభావ సౌకుమార్య సౌశీల్య గాంభీరాద్యనంత కళ్యాణ గుణంబులిట్టివని జక్కగ వక్కాణింప నక్కమల సంభవాదులకున్ దరంబె?

హే దశరథామాత్య వర్యులారా!

కం॥ శూరుడగు రామచంద్రుడు · ధారుణి స్త్రీయనక నేలతాటకి దునిమెన్ ।
యారీతి వినగవలె నిపుడారయ దెల్పంగవలయు నార్యులు మెచ్చన్॥

వ. రాముండు లోకసామాన్య రాజన్యుండుగాడని మీరలుగ్గడించి తిరిగాన ధర్మశాస్త్ర విరుద్ధంబులగు కర్మంబు లొనరించుట ధర్మ ప్రవర్తకులకు నిర్ణయంబె సుగుణ గరిష్ఠుండగు నారాజ శ్రేష్ఠుండు నారులయెడనిట్టి క్రూరకృత్యంబొనర్చుట శూరులకు మేరయగునా?

హే జనక భూపాలకామాత్యులారా వినుండు!

కం. ఆరూఢిగమేమిప్పుడు చారుతరంబుగను బల్కు శబ్దార్థంబీ
ధారుణి నారాయణుడితడారయనా సీతలక్ష్మియనదగు దెలియన్ ।

వ. దుష్టదానవులు లోకంబుల కరిష్టంబు లాచరించుచు దేవముని సంఘంబులకు కష్టంబులొనర్ప బద్రిష్టులైరని దుష్ట నిగ్రహ శిష్ట ప్రతిపాలకుండును ధర్మ సంస్థాపనతత్పరుండును, శరణాగతరక్షణ దీక్షాదక్షుండును లోకత్రయాధ్యక్షుండును, నగు లక్ష్మీనాయకునిన్ గని ప్రార్థింప, నవ్విష్ణుండ క్షీణకృపా కటాక్ష వీక్షణామృతంబు వెల్లి విరయ సాక్షాత్కరించి మీ యీప్సితంబొనగూర్చెదన్ గాన వెరువక మీ మీ నెలవులకున్ జనుండని యాజ్ఞయొసంగెనంత నవ్వైకుంఠుండు దశరథరాజ గర్భ రత్నాకర సుధాకరుండై యవతరించిన వారలుగాన, ధర్మస్వరూపుండగు రాముడు ఋషికులమున కనుష్ఠేయంబులగు తపోయజ్ఞాదులు, విధ్వంసం బొనర్చుటకు కారణ భూతురాలగుటచే గ్రంధిల భ్రుకుటీగాడల లాటియగు తాటకిన్ బరిమార్చి ధర్మరక్షణం బొనర్చినవారలు! లోకోపకారియగు యా క్రూరదానవిన్ దునుముట ధర్మ విరుద్ధంబుగాదు, వాత్సల్యాది గుణగరిష్ఠుండగు నవ్విష్ణునకు నిత్యానపాయిని యగు లక్ష్మి సీత నామంబున నిట్లవతరించె సందియంబేల!

హే దశరథామాత్యులారా!

కం. మీరిప్పుడుగ్గడించిన! చారుసుశబ్దముల యర్థసారము వినినన్
కూరిమి మచ్చిత్తంబుల కారయనమృతోపమానమగుచు జెలంగన్.

వ. మీరు వాక్రుచ్చినటుల శ్రీరామచంద్రుడు సాక్షాన్నారాయణుండును సీత శ్రీ మహాలక్ష్మియు ననుటకు సందియంబులేదియ్యెడ.

సీ. ముదమున జనకుండు సదమల హృదయుడై వరుని పూజించంగ త్వరిత గతిని
వచ్చుచున్నారట వైభవంబున బంధుభృత్య పుత్రామాత్య ప్రియులతోడ
ఘనరథాశ్వంబులు గజములందలములు భూసురాశీర్వాదములు జెలంగ
మంగళ ప్రదమగు మహిత వాద్యంబులు భూనభోంతరములు భోరుకొలుప
చెలగి వేశ్యలు నాట్యముల్సలుప ఘనసువాసినీ జనములు పుణ్యవస్తు చయము
వేడ్కగొని రాగవెడలిరి విభవ మలర అమల దీపికా సహస్రములు వెలుగ.

వ. ఇవ్విధంబున నమ్మహీపాలుండు వరుని బూజించ వేగం బరుదెంచుచున్న వాడు గాన మీరును నతి శీఘ్రంబున న్విచ్చేయుడు.

కం. ఈరీతి నిరుదెఱంగుల వారలు నున్గలసి గంధపడినక్షతలన్
కూరిమిజల్లుచు నపుడింపారగ ముదమొంది వెడలిరంతట వేడ్కన్.

కం. ధర నల్లూర్యన్వయమున! వరరంగాచార్యులనగ బరగినవాడన్
స్థిరముగ నీ సంవాదంబరయగ రచియించినాడ నార్యులు బొగడన్.

శ్రీ సీతారామార్పణమస్తు
శ్రీ భావదేవ చరణౌ శరణం ప్రపద్యే.



ఎదురుకోల రాయబారము సంపూర్ణము



# ప్రశంస

ఓమ్ శ్రియైనమః

శ్రీమత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సమేత శ్రీ భావనారాయణస్వామినేనమః

శ్రీ మద్వైఖనస మహాగురుభ్యోనమః

శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులు

తిరుమల - తిరుపతి దేవస్థాన అస్థాన పండితులు - అప్పికట్ల

—o—

శ్రీ మద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయవేదాన్త ప్రవర్తకులు, పూజ్యులు, పండితులు, పరమభక్తాగ్రేసరులు, శ్రీ భావనారాయణస్వామివారి అంతరంగ పురుషులు, తాతపాదులైన నల్లూరి రంగాచార్యస్వామివారిచే రచియింపబడిన యీ చిరుపొత్తము సరస్వతీస్తన ద్వయాంచిత కస్తూరికాది సౌరభమును ఇనుమడింపజేయు చున్నది.

భక్తిపారవశ్యములచే, సంగీత, సాహిత్యముల నుపాసించిన వీరి ప్రతిభ సర్వదా ప్రశంసనీయము. అనుప్రాస, యమకాద్యలంకృతయగు వీరి కవితాకన్యకా పదచాలనము మధురభక్తికి దోహదక్రియ యొనరించునట్లున్నది.

భక్త సంరక్షణాక్షీణ కృపావీక్షణ దక్షుండగు పుండరీకాక్షుండు వీరి కవితా కన్యక ననుగ్రహించి "దశపూర్వేషాం దశాపరేషాం" అను సూక్తిని సార్థకముచేయుగాత.

—o—

# రత్నత్రయము

అగమప్రవర, డాక్టరు శ్రీమాన్ దీవి కృష్ణస్వామయ్యంగారు

సంపాదకులు : శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంధమాల - నల్లూరు.

శ్రీమాన్ అగమప్రవర, 'వైఖానసాగమ వాచస్పతి' నల్లూరి వేంకట సీతారామా చార్యులుగారికి ప్రణామపూర్వకముగా వ్రాసుకొనుట. మీచే ప్రచురింపబడు పుస్తకము (రత్నత్రయము) చూచి చాల అనందముకల్గినది. మన పూర్వీకులైన కీ॥ శే॥ శ్రీమాన్ రంగాచార్యస్వామి తాతగారు రచించి మనకందించి వెళ్ళినవారి రచనలను వెలుగులోనికి తీసికొని వస్తున్న మీకు సంఘీయులందరు సదా ఋణపడియుందురనుటలో సందేహము లేదు. వారి ఋణము ఈ విధముగా తీర్చుకొనిన మీరు కడు శ్లాఘనీయులు. ఈ ప్రయత్నము అందరికి ముదావహమనుటలో సందియములేదు.

1. శ్రీహరి నామకీర్తనలు 48- వారే స్వయముగా ఆ కీర్తనలకు రాగ, తాళముల నిర్ణయించి మనోహరముగా సులభశైలిలో, శ్రవణపేయముగా హరిభక్తులకందించి మనోల్లాసమును కల్గించిరి. మరుగునపడిన, తలుపుదగ్గరపాట, కొట్నాల పాటలు, భక్తులకు, ఆస్తికులకు జ్ఞప్తికితెచ్చి పూర్వసాహిత్యమును వెలుగునకు తెచ్చిన మహామహులు వారు. వారికి సర్వదా కృతజ్ఞులమే!

2. ప్రత్యుత్థాన మహోత్సవము అను నామాంతరముగల ఎదురుకోల మహోత్సవము (రాయబారము) ను దృశ్య కావ్యముగా చూపించి భక్తుల హృదయముల భక్తి బీజములనాటి వెళ్ళిన మహనీయులువారు.

3. శ్రీ భావనారాయణస్వామివారి కృపాకటాక్ష వీక్షణ విశేషముచే లభించిన కవితా మకరందము జాలువారునట్లు లోకప్రసిద్ధిగాంచిన తిరుమంగయాళ్వారు చరిత్రమును రచించి ఆస్తిక లోకమునకందించి ధన్యులైరి. మనవంశ మూలపురుషులైన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యుల తాతగారి కీర్తి చంద్రికలను ఈ గ్రంథ ముద్రణ ద్వారా వ్యాపింపజేసిన మీరు కడు ధన్యులు. శ్రీ భావదేవులు గౌతమాన్వయమును ఆచంద్రార్కము రక్షించుగాత.

—०—

500025



# భగవదారాధనము



ఆంధ్ర సరస్వతి, కళాప్రపూర్ణ, కనకాభిషిక్త
ధర్మప్రచార భారతి - అపరవాగ్దేవి,
శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ - బాపట్ల

ఆరవ శతాబ్దియందు, శ్రీ క్రిమికంఠ చోళునిచే నిర్మింపబడిన దేవాలయమునందు స్వయంవ్యక్త అర్చామూర్తిగా మహనీయులు గౌతములైన శ్రీమాన్ చంద్రగిరి వెంకనాచార్యులవారి అధ్వర్యములో సుప్రతిష్ఠితులై పద్నాలుగు [14] శతాబ్దములనుండి నిత్య, దూపదీప నైవేద్యములగొనుచున్న దైవము భక్తేష్ట ప్రదుడైన శ్రీ భావనారాయణ స్వామి, శ్రీ వైఖానసాగమోక్తముగా భావపురియందు వెలసియున్న భావదేవుని పాద పద్మారాధన తత్పరులై వంశపరంపరలో అర్చకస్వాములైన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు, కవివతంసులు. వారిచే రచింపబడిన శ్రీహరి నామకీర్తనలు, ఎదురుకోలరాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రముల సంపుటిని వారి మనుమలు, బహుముఖ ప్రజ్ఞావంతులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆగమ పరీక్షాధికారుల మండలి సభ్యులు, శ్రీ తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి అలయమున శ్రీవారి అర్చనాదుల నిర్వహించి, ప్రసిద్ధులై నిరంతరము భావనారాయణస్వామి భక్తి తత్పరులై, అర్చకస్వాములుగా విలసిల్లుచు, స్థానిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగా, ప్రభుత్వముచే ఉత్తమోపాధ్యాయ

విశిష్ట సత్కారమునంది సాధనా వ్యవహారదక్షులైన శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారు తెచ్చియీయగా చూచి చాలా, చాలా సంతోషించితిని.

ఈ కావ్యత్రియ కర్తయగు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు క్రీ. శ. 1852-1928 మధ్యకాలమున జీవించి, శ్రీ భావనారాయణస్వామివారి ఆస్థాన పండితులుగా, అర్చకస్వాములుగా కవిమహోదయులుగా పేర్గాంచినవారు. నిత్యము స్వామి అర్చనా పరత్వముతో జీవికను సాగించిన మహనీయులు. కావుననే వీరి కృతులలో శ్రీహరినామ కీర్తనములను పేరున రచింపబడిన కీర్తనములన్నియు భావదేవస్తుతి పరములై నవగుట గమనార్హము.

ఈ కావ్యముఖమున వారు రచించిన సంస్కృత శ్లోకస్తుతికూడ ఉండుటచే వారు సంస్కృతమునకూడ కవిత్వము చెప్పగల పండితులనియు తెలియుచున్నది.

"రాజ్యలక్ష్మిబ్రోవవే, రాజీవనేత్రి, రాజ్యలక్ష్మి నన్నుబ్రోవవే"
భావనారాయణస్వామివారి దేవేరియైన రాజ్యలక్ష్మిదేవి కరుణకై ప్రార్థించుచు వ్రాసిన కీర్తనతో జగన్మాతయొక్క అనుగ్రహమునకు పాత్రులై గ్రంథరచనలోవారు ముందుకు సాగిరి. ఇది మిక్కిలి ప్రశంసనీయము; సృష్టియంతయు శక్తియొక్క అవిర్భావమేగదా!

"భావపురీనిలయా మాంపాలయ-" "నమ్మితి, నమ్మితిరా, నీ పాదముల నమ్మితితో నెరనమ్మియుంటి" మున్నగు కీర్తనలలో శబ్దాలంకార చమత్కృతిగాన వచ్చుచున్నది. ఇంతేగాక రేగుప్తి, బిలహరి, ఆనందభైరవి, పంతువరాళి, మున్నగు అనేక రాగములతో ప్రార్థనతో మొదలిడి మంగళారతులు, జోలపాటలతో స్వామిని నిద్రింపజేయు లాలిపాటలు వఱకును ఈ రచన మనోహర శబ్దప్రయోగముతో సాగుటచూడ వీరి పాండిత్యము సంగీత శాస్త్రజ్ఞానము స్వామిభక్తి అన్నియు ఎంతో కొనియాడదగియున్నవి.

ఇంక తిరుమంగయాళ్వార్ దివ్యచరిత పద్యకృతి- ఇది ప్రబంధ ఫక్కిలో, సరళ మనోహర శైలితో విరచింపబడిన పన్నిద్దరాళ్వారులలో నొకరైన తిరుమంగైయాళ్వారు చరిత్రము; తిరుమంగైయాళ్వారు జన్మచే అస్పృశ్యజాతికిచెంది నీలుడను పేరుతో జీవించువాడు- అతడొక భూసురునిచే పెంచబడుచున్న కుముదవల్లియను కన్యనుగాంచి ప్రేమించి తనను పెండ్లి చేసుకొనమని బలవంతముచేయగా, నామె భయవిహ్వలయై, అతని దప్పించుకొనుటకై, అటు నిటు పారిపోవజూచియు, బలీయుడైన నాతని తప్పించుకొను వెరవుగానక ఎట్లైన నాతని బారినుండి తప్పించుకొనవలెనని ఆలోచించి 'నీవు పంచ సంస్కార సంపన్నుండవై ద్వాదశోర్ధ్వపుండ్రముల ధరించి వైష్ణవారాధనం

బాచరించితేని నిన్ను పరిణయంబందెదనని చెప్పను. అంత ఆబాలికయందత్యంత ప్రేమావిష్టుండై న ఆనీలుడట్లే ఒక సదాచార సంపన్నుడై న వైష్ణవు నాశ్రయించి, కుముదవల్లి కోరినరీతిగా వైష్ణవారాధకుడై, యామెను పెండ్లాడును. ఈ ఘట్టముచూడగా భక్తి తత్పరులకు జాతి మత, కులగోత్రములతో నిమిత్తములేదని వైష్ణవమత మెప్పుడో అంగీకరించినదని చెప్పవలెను.

అనంతరమాతని భవిష్యజ్జీవితమున నీలుడే వైకుంఠధాముని వరప్రసాదమున "తిరుమంగైయాళ్వారుండై పన్నిద్దరాళ్వారులలో నొకడుగా ప్రసిద్ధిగాంచెను.

ఇట్టి పవిత్రగాథను కావ్యముగా విరచించి శ్రీమాన్ రంగాచార్యులుగారు తరించుటేగాక, సమస్త ప్రజలను తరింపజేయుటయేగాక ఈనాడు గగ్గోలుపెట్టుచున్న సర్వప్రాణి సమానభావము నేనాడో భారతీయులంగీకరించిరను సత్యమును చాటిచెప్పినారనుట అత్యుక్తికాదు.

ఇక కావ్యగత శైలి సరళసుందరము.

"ధరాతలేశుడంచు నీకు నింతతామసంబేలరా
సురేంద్రుడైననాదు ముందునూటి నిల్వలేకురా
దురాత్మ నీవనంగనెంత దున్మివేతు నిప్పుడే
సరాసరిగ నాదు దృష్టి జక్కనిల్పి చూడుమా॥

మున్నగు పద్యములను పరిశీలింపగా వీరి కవిత ద్రాక్షాపాకమని తెలియగలదు. అట్టి పుణ్యకృతిని రచించిన తాతగారి రచనములు శిధిలావస్థలోనుండగా మనుమడై న శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులవారు ఈ కావ్యములను పునర్ముద్రింపజేసి వ్యాప్తిలోనికి తెచ్చుటకై కృషిచేయుటచూడగా వారికిగల దైవభక్తియేగాక సాహిత్యాభిమానము, ప్రాచీనులై న పెద్దలయెడగల భక్తిభావమును ప్రస్ఫుటమగుచున్నవి.

శ్రీ భావనారాయణస్వామియనుగ్రహమున, శ్రీమాన్ వేంకట సీతారామాచార్యుల వారిట్టి సత్కార్యములను సల్పు దీర్ఘాయురారోగ్యభాగ్యములు లభించునట్లు స్వామి ప్రసాదించుగాక.

—o—



# చల్లని పలుకులు

శక్తికవిశేఖర "తమ్మరపోతన"
శ్రీమాన్ నరహరి గోపాలాచార్యులు - తమ్మర - నల్గొండ జిల్లా

శ్రీమాన్ నల్లూరి రంగాచార్య మహాకవి విరచిత భావపురి భావనారాయణస్వామి కీర్తనలు శ్రవణానందముగ విని సంతసించితిని. 1903వ సంవత్సరమున ముద్రింపబడి "శ్రీహరి నామకీర్తనలు" అనుపేర ప్రచారమునకు వచ్చిన ఈ గ్రంధమును - గ్రంధకర్త పౌత్రులు వేంకటరాయాచార్యులగారి పుత్రులు చిరంజీవి నల్లూరి వేంకట సీతారామాచార్యులు పునర్ముద్రణ గావింపబూనుకొనుట ముదావహమైన అంశము

ది 22-12-1989న నాపట్ల అత్యంతాభిమానముగల మా సీతారామాచార్యులు బృందావనం రంగాచార్యులు (పరుచూరు) కలిసి హైదరాబాదునుండి వచ్చుచు మా ఇంటి వద్ద నాతో యీ పునర్ముద్రణ విషయమును ప్రస్తావించి అభిప్రాయమును వ్రాసి యిమ్మనుట నాకెంతో ఆనందము కల్గించినది. గ్రంధమునందలి ఘట్టములలోగల భావ చమత్కృతిని రంగాచార్యుల బావగారు వివరించినారు.

ఆ కీర్తనలు వినుచున్నంతసేపు దాసుని మనస్సు స్వామియందే నిల్చియున్నది. ఈ భావనలతో నిండియున్న గ్రంధము శాశ్వతముగ లోకమున ప్రచారముగావలెనని ఆశించుచున్నాను. లోకాధి నాధుడైన శ్రీ బాపట్ల భావదేవునికి నమస్కరించు చున్నాను. ఈ అమూల్య గ్రంధమునకు పునర్ముద్రణావకాశము కలిగించిన మా చిరంజీవి సీతారామాచార్యుల నాశీర్వదించు చున్నాను. ప్రచురణ కర్తలు : చి॥ సీతారామాచార్యులవారికి గ్రంధ ముద్రణ విషయమున శ్రీరామచంద్రమూర్తి సర్వవిధాభ్యుదయమును సమకూర్చుగాక!

నల్లూరి రంగ కవివరు
చల్లని పలుకులకు రామచంద్రవిభుండే
ఉల్లమున మెచ్చుచుండగ
పిల్లలమగు మేము మెచ్చు విధమేమందున్?

— o —

# న వ జీ వ న

మధురకవి:- శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు - పరుచూరు



ఇవి హరినామకీర్తనలభీష్ట ఫలప్రద సంపదల్; రసో
ద్భవములు; భావదేవుని కృపాఫలముల్: కవితా కళామహో
త్సవములు; రాగయుక్తములు - శారద అందెల మేలినాదముల్
ప్రవిమలముల్; మనోజ్ఞములు; భక్తియుతమ్ములు వేణునాదముల్.

ఆచారానుగుణమ్ములై నిగమధర్మావేశ పూర్ణమ్ములై
ఆచంద్రార్కము వెల్గునీయునవియై - ఆంధ్రాన-నల్లూరి రం
గాచార్య ప్రతిభా ప్రదర్శకములై అత్యుత్తమానంద రే
ఖాచాంద్రీమయశోభ నింపెనివి - సత్కావ్య ప్రభామూర్తులై

హరిభక్తిన్ బ్రకటించు తత్త్వము; విశిష్టాలోచనారీతి: సుం
దర భావానుగుణైక వర్తన, మహాధర్మానుకూల ప్రస
న్నరసోపాసన: యోగ్యలక్షణములై నల్లూరి వంశమ్మునన్
మెరసెన్ పూర్వమునుండి - సచ్చరితయోర్మిన్ పేర్మినింబెంచగన్.

గౌతమ సోదరులుగ; వి
ఖ్యాతిన్గను ఘనులయందు-గణనీయుండౌ;
సీతారామాచార్యుని;
చేతమ్మె ముద్రణమును సిద్ధమొనర్చెన్.

అచ్చువేయించుటనియెడి ముచ్చటను; ఫ
లింపజేయుట; నేడు సహింపరాని
భారమైనను - వదలని పట్టుబట్టి
పూర్తిజేసెను మనుమడు పుణ్యమూర్తి.

కారణమేదియైన కలకాలమునుండియు పాతపెట్టెలన్
జేరి - స్వరూపమేచెడి కృశించిన తాతకృతిన్ గ్రహించి - న
ల్లూరి యశోవిలాస విభవోద్ధతి పెంచిన పౌత్రుకార్య దీ
క్షారతి మెచ్చగాదగిన సత్కృషి - ఇద్ధిచిరాయు వయ్యెడున్.

సాయమొనర్చువారిగని సంబరమందక - కోరిహేళనన్
జేయగబూనువారి పయిచిత్తమునందు, దురాగ్రహమ్ము రా
నీయక - తాతకావ్య రమణీయతలన్ ప్రకటించిమించి నా
డీయనఘుఁడు - వంశమునకింత యశమ్మును సంఘటించుచున్.

ప్రతిపదమ్మున రసాస్పదమైన నవదీప్తి
కులు కులనొలుకుచు గోచరింప;
శైలీవిలాస భాస్వన్మహానాకృతి
కావ్యదేవతకు యోగ్యతను గూర్పః
పదికాలములపాటు మదికి ముదమ్మొద
వించు వర్ణనలు తృప్తిన్ ఘటింప;
ఈనాటి కానాటి కేనాటికిని; శిరో
ధార్యమై కధమహత్త్వము పెలార్పః

సమ్మతింగన్న హరికీర్తనమ్ములనెడి
కృతి సుమమ్మిప్పుడక్షరాకృతి విశేష
మందుకొనుటన్నమాట - అనంతమోద
కారణమ్ము - సారస్వత తోరణమ్ము.

ప్రథిత హరినామకీర్తనల్ బుధుల హృదయ
సదనమున మార్మ్రోగగః జాలుగాక!
కలి కలుషహరములగుచును గాయకులకు
కంఠహరమ్ములై ఖ్యాతిగాంచుగాక ॥



భగవాన్ విజయతే

# శ్రీరంగ పంచకము

కరుణశ్రీ డాక్టరు జంధ్యాల పాపయ్యశాస్త్రి - గుంటూరు

ఆత్మీయులు డాక్టరు నల్లూరి వేంకట సీతారామాచార్యులవారికి - అభివాదాలు. మీ లేఖ పుస్తకములు చేరినవి. సంతోషము. శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులువారు మహాకవులు, మహాపండితులు, భక్తులు, సందేహములేదు. వారి పౌత్రులగుట మీ భాగ్యము. మీరు కోరిన విధముగా శ్రీమాన్ రంగాచార్యవర్యులను చదివి సంతోషించి శ్రీరంగ పంచకము వ్రాసి పంపుతున్నాను.

శ్రీ భావదేవ పదపంకజ భక్తి సాంద్రః 1
స్వాధ్యాయవైద్య కవితాగమ శాస్త్రకేంద్రః
వైఖానసాన్వయ పయోనిధి పూర్ణచంద్రః
సత్కీర్తిమాన్ జయతి రంగమహా కవీంద్రః ॥

ఉదయించె ప్రథిత 'నల్లూరి' వంశక్షీర
జలరాశి శారద చంద్రుడగుచు
అందించె "శ్రీ మదర్చావతార ప్రభా
వము" హృద్య గద్య పద్యములలోన;
ఆవిష్కరించె "శ్రీహరి నామకీర్తనల్.
రమణీయ రాగతాళములుగూర్చి;
విరచించె రుచిరమౌ "తిరుమంగయాళ్వారు
చరితము" నవరస భరితముగను;

వ్రాసె "నెదురుకోల రాయబారము" సు క
ల్యాణవేళ మాటలాడు లీల
భావదేవభక్తిపరుడు "రంగాచార్య"
బుధవరుండు ; ధర్మపథ చరుండు ; 2

బంగారమ్ములు భక్తసంతతికి, శో
భాపూరముల్; వాణికిన్
సింగారమ్ములు; భావదేవచరణ
శ్రీ పై భవాగారముల్;
గంగా భంగ తరంగ మంగళగతుల్;
కళ్యాణ రమ్యాకృతుల్;
రంగాచార్య సుధీశిరోమణికృతుల్
రాకేందు బింబద్యుతుల్॥ 3

కవీశ్వరో భిషగ్రత్నం
పౌరాణిక శిరోమణిః
వైఖానసాగమా చార్యో
రంగాచార్యో మహీయతామ్ః 4

పుత్ర పౌత్ర ప్రపౌత్రశ్రీః
రంగాచార్య యశోలతా
భావదేవ ప్రసాదేన
జీయాదాచంద్ర తారకమ్॥ 5

ఇతి శివమ్

—o—

## సత్కృషి

శ్రీమాన్ డాక్టరు మురికిపూడి వెంకట నరసింహాచార్యులు

ప్రధానార్చకులు ; శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానము, బొప్పూడి

శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవస్థానము - మారుతీనగర్, బొప్పూడి

శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యుల బావగారికి శుభాశీస్సులు. వైద్య శేఖర, కవి, పండిత, పౌరాణిక, దైవజ్ఞ మంత్రవేత్తలుగా ప్రసిద్ధినందిన మీ తాతగారగు కీ॥ శే॥ శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారు, ప్రతి వైష్ణవాలయములో జరుగు బ్రహ్మోత్సవ [కళ్యాణ] ములందుపయోగపడునట్లు, 'ఎదురుకోల రాయబారము' శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము భజనలకు వీలుగా శ్రీహరినామ కీర్తనలు అనువాటిని శ్రీ భావదేవాంకితముగా రచించి వంశ గౌరవమును పెంచిన మహనీయులు, వారి రచనలను ముద్రించి భక్తకోటి కందించ సంకల్పించి మీరు చేయుచున్న ఈ సత్కృషి కడు ప్రశంసనీయము. విద్యావేత్తలై, కార్యదక్షతగలిగి, వైఖానసాగమ వాచస్పతి బిరుదాంకితులైన మీరు ఇట్టి సత్కార్యములొనర్చునట్లుగా మీ ఆరాధ్య దైవమైన శ్రీ భావదేవుడు మీకు సదా ఆయురారోగ్యైశ్వర్య బుద్ధిర్బల, యశోధైర్యము లొసంగి సర్వదా సంరక్షించుగాక.

—o—

# ఆనందదాయకము



శ్రీమాన్ దీవి విఖనసాచార్యులు
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు
తిరుమల - తిరుపతి దేవస్థానములు - తిరుమల

శ్రీమదిత్యాది శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులు అన్నగార్కి అనేక నమస్కారములు. అంతా క్షేమము. కీర్తిశేషులు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులు తాతగారిచే రచింపబడిన "శ్రీహరినామ కీర్తనల" పుస్తకము చూచినాను. మీరు మీ తాతగారి యందలి భక్తితో ఆ పుస్తకమును పునర్ముద్రణ గావించుట ప్రశంసనీయము. అవి వారు భక్తి పారవశ్యముతో వ్రాసిన అమూల్య కీర్తనలు. వీటితోపాటు మంగళహారతి కీర్తనలు, పవళింపుసేవ కీర్తనలు తలుపు దగ్గరపాటలు, కొట్నాల పాటలుకూడ చక్కగా రచింపబడినవి. అచ్చట దేవాలయములో నిత్యము పాడుచున్నారా: లేనిచో నిత్యము పాడుట వలన బహుళ ప్రచారమై ఆనందదాయకముగాగలదు. మీ కృషికి శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆశీస్సులు సర్వదా ఉండగలందులకై ప్రార్థించుచున్నాను.

—o—

# మహోపకారము



శ్రీ ఏలేశ్వరపు నరసింహారావు
కార్యదర్శి, నేషనల్ థియేటరు, విశ్వహిందూపరిషత్ కార్యకర్త
పత్రికా విలేఖరి - బాపట్ల

"ఆగమాచార్య" "వైఖానసాగమ వాచస్పతి" పండిత శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులవారు, వారి పితామహులచే రచింపబడి ప్రస్తుతం లభ్యంకాని అనేక అమూల్య ఆధ్యాత్మిక గ్రంథాలను పునర్ముద్రించి నేటి తరానికి మహోపకారము చేశారు. లోగడ "అర్చావతార ప్రభావము" బాపట్ల శ్రీ భావనారాయణస్వామివారి క్షేత్రమహత్మ్యము" (భావపురి దేవాలయ చరిత్రలతో) దివ్యస్తుతి, పద్యావళి, మరెన్నో గ్రంథాలను వెలుగులోకి తెచ్చారు. ప్రస్తుతం మరికొన్ని గ్రంథాలు ఆస్తిక మహాశయుల కరకమలాలను అందుకోనున్నాయి. పరాత్పరుడైన శ్రీ రాజ్యలక్ష్మి సమేత శ్రీ భావదేవుడు, శ్రీ ఆచార్యులవారికి ఆయురారోగ్య ఐశ్వర్యాదులిచ్చి ఇలాంటి సద్గ్రంథ ప్రచురణకు తగినశక్తి నివ్వవలసినదిగా ప్రార్థించుచున్నాను.

—o—

# ప్రశంస

కవికోకిల శైవాగమ విద్వాన్, శతప్రతిష్ఠాచార్య
బ్రహ్మశ్రీ నందివెలుగు వేంకటేశ్వరశర్మ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అర్చక పరీక్షాధికారుల సంఘ సభ్యులు
టి. టి. డి. శైవాగమ ఆస్థాన పండితులు - మైలవరం

శ్రీహరినామ కీర్తనలు, ఎదురుకోల రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రము అను మూడు గ్రంధములను, నేను స్థాలీపులా కన్యాయముగా జూచితిని.

భావపురి, సుందరవల్లీ రాజ్యలక్ష్మీసమేత శ్రీ భావనారాయణస్వామివారి వంశ పరంపరార్చకులు, పండిత, భిషగ్రాజవరేణ్యులు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు 1903 వ సంవత్సరములో స్వామివారి కంకితమొనర్చి ముద్రింపబడిన గ్రంధములు, వారి మనుమలు పండిత, ఆగమాచార్యులు, వైఖానసాగమ వాచస్పత్యాది బిరుదాంచితులు శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారు పునః ముద్రించి భక్తవరుల కందజేయుట వీరి సాహిత్య సేవకిది యొకసాక్ష్యము.

ఈ కీర్తనలు, కీర్తనీయమై, సులభశైలిని, భక్తులకు మనోహ్లాదముగా, గానమొనర్చుట కనువుగా, రాగయుక్తముగా కూర్చబడియున్నవి. కవిత లలిత పదకలితమై నవోజ్జ్వలమై, మధురరూపమై, మహిమాతిరేక స్ఫోరకమై సంతస మొదవింపఁజాలి యున్నవి. కీర్తనలు అఖండ భావనావిలసితములు. శబ్దములు అనుపద ప్రాసలలో మనసిజ శరతుల్యములు.

ఆలయాదులలో కళ్యాణోత్సవములందు ఈ ఎదురుకోల రాయబారము వినియోగించుటకెంతయు ఉపయుక్తము. సముచితము. శ్లాఘనీయము - చోరసంవాదముకూడ ముద్రింపబడినది.

రచయిత కీర్తిశేషులు, నల్లూరి రంగాచార్యులుగారెంతయు ధన్యజీవులు. స్మరణీయులు వీరి పౌత్రులు శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారు - వీరికి భావదేవాంకితములనేకములు ప్రచురింపజేయుశక్తి సామర్ధ్యములు వీరి ఇలవేలుపు, శ్రీ భావనారాయణస్వామివారు ప్రసాదించుగాక !

—o—

# అభినందన

శ్రీ విఖనస గురవేనమః
"కవి కథకరత్న" "కథాగాన కళాప్రపూర్ణ"
"హరికథా సుధాకర శ్రీమాన్ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసు
నరసాపురం – పశ్చిమగోదావరిజిల్లా

శ్లో॥ శ్రీమన్నల్లూరి వంశ్యం స్థిరతరయశసం స్నిగ్ధభావ ప్రసన్నం
విద్వన్మాన్యం వదాన్యం విఖనసకుల సంజాత మార్యావతం సం
భక్తం శ్రీ భావనారాయణ విమల పదాంభోజ సేవానురక్తం
రంగాచార్యం సుధీంద్రం రసమయ కవితా ప్రాభవం భావయామి.

కం. పదపద్య కవితలందున
విదితంబగు మీదు ప్రజ్ఞ వివరింపఁగ శా
రదయే ఁ పదాకృతిఁగొని
యుదయించిన యట్లుతోచునో సహృదయా!

—o—

# భావన

ఆగమచార్య, శ్రీమాన్ పండిత రొంపిచర్ల శ్రీనివాసాచార్యులు, R M P.
పాతరెడ్డిపాలెం – వైయా చేబ్రోలు గుంటూరుజిల్లా

మీరు బాపట్లలో ప్రతివత్సరము శ్రావణ పూర్ణిమనాడు శ్రీ భావనారాయణస్వామి సన్నిధిలో సర్వవిద్యా ప్రదాతయైన శ్రీ లక్ష్మిహయగ్రీవమూర్తి జయంతి, భృగు, మరీచ్యత్రి, కశ్యపాది మహర్షి గణసేవితులైన శ్రీ విఖనసాచార్యస్వామి తిరునక్షత్ర మహోత్సవములు త్రయాహ్నికముగ జరుపుచు అందు ప్రసిద్ధులైన అన్ని రంగములలోని విద్వాంసులకు శ్రీవారి శేషవస్త్ర సన్మానాది కార్యక్రమములు నిర్వహించు విషయము యావద్భారత దేశమంతయు తెలిసిన విషయమే

దీనితోపాటు ప్రతి సంవత్సరము ఒక భగవద్విషయమైన గ్రంధమునుకూడ ప్రచురించవలెనని సంకల్పించి శ్రమతో మీరు లోగడ వెలుగునకు తెచ్చిన శ్రీ బాపట్ల భావనారాయణస్వామివారి క్షేత్రమహాత్మ్యము, పద్యావళి, అర్చావతార ప్రభావము దివ్యస్తుతి అను గ్రంధములు భక్తులకానందము చేకూర్చినవి. మీరిప్పుడు వెలుగునకు తెచ్చుచున్న ఈ గ్రంధములోని కీర్తనలు నిత్యము గానమునకుపయోగములైనవి. కళ్యాణోత్సవాదులలో మావంటి యాజ్ఞికస్వాములకు, కళ్యాణమునకు ముందుగా జరుగు ఎదురుకోల మహోత్సవములో "రాయబారము" ఉత్సవాంతమున జరుగు దొంగలదోపు ఉత్సవములో పఠనమునకుపయోగకరముగా తిరుమంగయాళ్వారు చరిత్రము ఎంతో ఉపయుక్తములైనవి. మీకృషి సర్వదా కీర్తనీయమై భగవదనుగ్రహ ప్రాప్తిని కల్గించాలని నా భావన.

—o—

# అమృతధారలు

"విద్యాలంకార" "ఆగమ భాస్కర" శ్రీమాన్ పండిత H. A. కేశవాచార్యులు
ప్రధాన ఆగమ పండితులు. ఎండోమెంటు కమీషనరు, ఆఫీసు బెంగుళూరు
అ. భా. అర్చక సంఘ కార్యదర్శి ఆగమభవన్ పంప మహాకవిరోడ్ - బెంగుళూరు - 4

శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులగార్కి ప్రణామములు, ఉభయ కుశలోపరి

శ్రీమాన్ కీ॥ శే॥ నల్లూరి రంగాచార్యులవారు శ్రీ బాపట్ల భావదేవుని కరుణామృత దృష్టిలోమునిగి రచించినవాటిలో అమృత ధారలూరుచున్నవి. భక్తిరస ప్రధానంగా కీర్తనలను, రసవత్తరంగా, ఎదురుకోల రాయబారమును, ప్రబంధపక్కీలో తిరుమంగయాళ్వారు చరిత్రమును మన కందించిన మహర్షితుల్యులు. ఇట్టి రచనలను వెలుగునకుదెచ్చి గ్రంధరూపమున అందించు మీకు సర్వవిద్యలకాధారదైవమైన శ్రీ లక్ష్మీహయగ్రీవమూర్తియు, మీ కులదైవమైన శ్రీ మత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సమేత శ్రీ భావనారాయణస్వామియు, మన కులగురువులు, సూత్రకర్తలు, భగవత్ప్రతిష్ఠోత్సవ అర్చనాదుల బోధించిన భృగు, మరీచ్యత్రి కశ్యపాది మహర్షి గణసేవితులైన శ్రీ విఖనసాచార్య స్వామియు, తమ తమ కరుణారస పూరిత అమృతధారలు కురిపించి మీకు సర్వదా, సర్వధా ఇతోధిక శక్తిని ప్రసాదింతురుగాక।

—o—

# ధన్యులు

శ్రీమాన్ పండిత N A K శ్రీనివాసాచార్యులు-వైఖానసాగమ పండితులు
తి. తి. దే. వెంకటేశ్వరవేదకళాశాల [కళ్యాణిడామ్] శాంతినగర్ ఖాదికాలనీ
కె. టి. రోడ్ తిరుపతి

శ్రీమాన్ వేంకట సీతారామాచార్యులగార్కి నమస్కారములు

శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారు భగవద్గుణగణ వర్ణనయే ప్రధానముగానెంచి శ్రీ భావదేవస్తుతితో మొదలిడి, సర్వవిఘ్నోపశాంతులైన శ్రీ విష్వక్సేనుని గూర్చియు అవతార మూర్తులైన శ్రీరామకృష్ణాదుల లీలలను గూర్చియు, అంజనేయునిగూర్చియు మంగళహారతులను, కీర్తనలను లాలిపాటలను, నువ్విపాటలను, కొట్నాల పాటలను, తలుపుదగ్గరపాటలను, రాగతాళ యుక్తముగా రచించిన ధన్యులు, వీరు రచించిన ఎదురుకోల రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రము అన్ని దేవాలయములందు బ్రహ్మోత్సవ [కల్యాణోత్సవము]లందును మిక్కిలి ఉపయోగకరములైనవి. నిత్యమూ భావదేవునారాధించి తరించిన శ్రీమాన్ రంగాచార్యస్వామివారు గతించిన 64 సంవత్సరముల తర్వాత మీరీనాడు చతుష్షష్టి [64] కళలకారాధ్యుడైన శ్రీ భావనారాయణస్వామి కరుణచే మీ తాతగారి రచనలకు రూపకల్పనచేసి గ్రంధరూపమున భక్తకోటికందించు మీకు ప్రతి సంవత్సరము ఒక్కొక్క ఆధ్యాత్మిక గ్రంధముద్రణగావించి భక్తకోటికందించగల సామర్థ్యమును సర్వాంతర్యామియు, పర, వ్యూహ, విభవ, అంతర్యామ్యర్చా స్వరూపుడయిన శ్రీ భావదేవుడు ప్రసాదించుగాకయని మనసార కోరుకొనుచున్నాను.

—o—

శ్రీ విఖనసే నమః

# నాలుగుమాటలు

శ్రీమాన్ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు, ఎం ఏ. (సంస్కృతము) ఎం.ఏ.[తెలుగు]
బి.ఇ.డి. "భాషాప్రవీణా సాహిత్య విద్యావిద్యాప్రవీణ"
వైఖానసాగమవర; "అలంకారకోవిద" [రిటైర్డ్] లెక్చరర్ అండ్ హెడ్ అఫ్
ది డిపార్ట్‌మెంట్ అఫ్ సంస్కృతము, శ్రీ వై. యన్. కాలేజి - నరసాపురం
P L.D. (Inskt) on kalpa - Sutram"
Ex. Member Board of Studies (Samscrit) Andhra University
7-1-43 "శోభన్‌మందిర్" అద్దంకివారివీధి, నరసాపురం - 534275
[పశ్చిమగోదావరిజిల్లా - ఆంధ్రప్రదేశ్]

"నలుగురు నాలుగుమాటలు అంటారు" అన్నది లోకోక్తి. అయ్యది దోషోద్ఘాటనకై వాడుకలోనికి వచ్చిన. ఈ "నాను డి" ఆ నానుడిలోనిదికాదు. ఇదియొక కృతిని వెలయజేసిన సుకృతిని, కృతిగత విషయ విశేషతతిని గూర్చి యించుక పరిచితి గావించుటకే యుద్దిష్టమైన వాక్య విన్యాసము.

మురారి మహాకవి "అనర్ఘ రాఘవ నాటకములో" గుణైర్వేత్తా వద్భిర్జయతి పునరన్యో జగతికః? స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీర మధుర స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథము పకరిష్యంతి కవయః. అని పేర్కొన్నట్లుగా భగవానుడైన, శ్రియః పతిదక్క, హేయ ప్రత్యనీక కళ్యాణగుణ విశిష్టుడెవ్వడును లోకమున లేకపోవుట; గంభీర మధుర వచోనిచయ మహిత కవితావతారులైన మహామహులు తమ యత్యుత్తమ వ్యక్తిత్వమునకు సార్ధక్యమును సంపాదించుకోగల్గుట. భగవద్గుణమణి దర్పణాయమానములైన వాక్యములను నిర్మించి, నిల్పినంగాని సాధ్యముకాదనుట కవి విద్వల్లోకానుభూత పూర్వంబు. ఈ నిత్య సత్యమునకు దృష్టాంతమే శ్రీ మపిత్యాది శ్రీమాన్ నల్లూరి గౌతమ రంగాచార్య వర్యులచే రచింపబడి, వారి పౌత్రులచే ప్రకటింపబడిన శ్రీహరి నామ కీర్తనాది గ్రంధ సంపుటము.

ఇందలి కీర్తన గ్రంధములోని పద గ్రధనము, రచనలోని యొప్పిదము, భక్తి భావ ప్రకటన, ప్రయత్నము, మున్నైనవి, ఈ రచయిత తొలుతటి, అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య మున్నగు పద-కీర్తన కర్తల కెంతమాత్రము తీసిపోకుండుననుట కంటె వాసికెక్కినన్నచో ఉన్నది యున్నట్లుగాచెప్పినట్లౌను రచన, సహజ మధుర చతుర తరమయి, పరితల మనసు నధిగమించి, హృదయమునత్తుకొని, అత్మానంద సంధాయకమౌచున్నదన్న నత్యుక్తికాదు.

ఇట్టివారి "చిట్టెపు నునుపచ్చిట్టి తేనెసోనల" గేళిసేయు పోరామిగల విన్నాణ పుంగావ్య నిర్మాణము నెంచియేకాబోలు" సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ్మని" భర్తృహరి రాజయోగి స్వానుభవ పూర్వకముగా బేర్కొనెను.

పైని జేర్కొన్న పద రచయితలతోడనే పద కవిత కనుమఱుగయి పోకుండగ ఇంకను "బదికాలాలపాటు" లోకములో నేలుబడిని సాగింపగల్గునని, ఈ మహామహుల పదములు - మిగిలిన రచనలు సహృదయులకు మిగుల హృదయ పరితోషముతోపాటు దృఢమగు విశ్వాసమునుగూడ రోషమూలము జేయుచున్నవి.

నిజమునకిట్టి యుత్కృష్ట శైలీ విన్యాసములకు నావంటివాని కతిపయ పద గ్రహణ జనిత కుతూహల, హాలహాలికాసకూతి సాహస కౌతూహలముతో గిలికించిన యిట్టి పొల్లు మాటలక్కరలేదను కొనుటకాదు. ఇట్టివితప్పక నీటిమూటలేగాక! మరేమౌనని ప్రశ్నింతును. చిత్తగింపుడు సెలవు.

## మహాపురుషులు

శ్రీ శ్రీనివాసాయ నమః

శ్రీమాన్ నారాయణం శ్రీనివాసాచార్యులు

ప్రధానార్చకులు - పొన్నూరు శ్రీ భావనారాయణస్వామివారి దేవస్థానం

కూడలి శ్రీ వెంకటేశ్వరస్వామి దేవస్థానం - సంగంజాగర్లమూడి తెనాలి తా॥

శ్రీమాన్ సీతారామాచార్యుల బావగార్కి ఆశీస్సులు

శ్రీ బాపట్ల భావనారాయణస్వామివారి అంతరంగ పురుషులైన మహనీయులు మీ, మా తాతగారైన రంగాచార్యులవారు. వారి రచనలను వెలుగునకు తెచ్చిన మీకృషి చాల గొప్పది. శ్రీ రాజావాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారి ఆస్థాన వైద్యులు, ఆగమవేత్తలు, పండితులైన శ్రీమాన్ నల్లూరి వేంకట్రాయాచార్యులు, జానకమ్మ దంపతుల కుమారులే ఈ గ్రంథకర్తయైన రంగాచార్యులవారు. వీరు శ్రీ ఉల్లిపాలెం జమీందారుగారి ఆస్థాన పండితులు వైద్యశేఖరులైన శ్రీమాన్ నల్లూరి చల్లయాచార్యులగారి చతుర్థ పుత్రులైన గోపాలాచార్యులవారిని దత్తుచేసికొని తమ తండ్రిగారి పేరైన వెంకట్రాయాచార్యులగారి పేరుబెట్టికొని మా పితామహులైన శ్రీమాన్ నారాయణం కృష్ణమాచార్యులగారి ద్వితీయ పుత్రికయు, మా రెండవ మేనత్తయగు రాఘవమ్మగారిని ధర్మపత్నిగాజేసి, వారి సంతానము చూచుచు పెద్ద మనుమనికి తన పేరేబెట్టికొని మురిసిపోయెడివారు.

తమకు పుత్రికాసంతాన కొఱత దీర్చుకొనుటకై కవితా కన్యలగని తమ ఆరాధ్య దైవమై దారయశోనిధియైన శ్రీకృష్ణ పరమాత్మ స్వరూపుడగు శ్రీ భావనారాయణస్వామి వారి కంకితమొసంగి, మాతాపితృ వంశములలోని ఇరువదిఒక్క తరములవారిని తరింప జేసిన మహాపురుషులు. అట్టివారి ఆశయసిద్ధికై మీరొనర్చు ప్రయత్నమును కవితాకన్యకల పాణిగ్రహణ మొనర్చిన శ్రీ భావదేవుడు సఫలీకృతమొనరించి కార్యసిద్ధిని ప్రసాదించ వలసినదిగా శ్రీ స్వామివారిని మనసారా ప్రార్థించు చున్నాను.

—o—

# ఆమోదము

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః

వైఖానసశేఖర, వాస్తుజ్యోతిషాగమ ప్రవీణ

శ్రీమాన్ పండిత పెద్దింటి లక్ష్మీనరసింహాచార్యులు

దేవస్థానము పోస్టు అంతర్వేది - 533 252 రాజోలు తాలూకా తూ॥గో॥జిల్లా

ఆమోదశబ్దమునకు, సంతోషము, సువాసన, మోక్షభేదములను నర్థములున్నవి. మహనీయులు, ప్రాతఃస్మరణీయులునైన, ఉభయవేదాన్త ప్రవర్తకులు శ్రీమాన్నల్లూరి రంగాచార్యులవారి కావ్యగుచ్ఛ గుంభితరచన ఆమోద రసాస్వాదనామోద మేదుర సమీర కుమార సుకుమార ప్రసారమే ఈ నావాక్య విన్యాససారము.

ఈ గుచ్ఛమున శ్రీహరినామ సంకీర్తనలు, కొట్నాలపాటలు, ఎదురుకోలు రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రము ననునాల్గు మనోహర కుసుమములుగలవు. తొలివి రెండునూ సంగీత వాసనావాసితములు. మలివి సాహితీసౌరభ శోభితములు. మఱియు నివియన్నియును శ్రీ భావనారాయణ పాదద్వంద్వార్పితములు అగుటచే సహజముగనే సుభగములును, శుభదములును, సురభిళమును నగుటయేగాక పవిత్రతను మిగుల సంతరించుకొని శిరోధార్యములు, కంఠస్థీక్రియమాణములును అగును.

చివరదగు తిరుమంగయాళ్వారుల చరిత్రము గద్యపద్యాత్మకమైన చంపూ ప్రబంధముగావున మాధ్వీక, మృద్వీక మిశ్రితమైన అపూర్వ రసాయనముగా భాసించుచూ భవ్యవాగ్య కళాకలితమగు శ్రావ్యగీతికా సౌభాగ్య యోగ్యమగుచున్నది.

పురాకృత సుకృత పరిపాకముచే మానవత్వము, అందును త్రిశుక్లత్వము. (జన్మచే, విద్యచే, కర్మచే, పరిశుద్ధత) అందును చక్కని కావ్య నిర్మాణ చాతుర్యము అదియును భగవద్గుణ గణగణన వైభవ ప్రాభవ పరాయణము అగుటయే. పరంపరా పరికలితములై ఉత్తరోత్తరము బలీయములై శ్రీరంగా చార్యవర్యుల ఉత్తమోత్తమమును వేనోళ్ళ చాటుచున్న నిత్య సత్యము. స్తవముకాదు. వాస్తవము. అర్థవాదముకాదు. యదార్థామోదము. ఇది భగవదనుగ్రహ ప్రాప్తమైన భక్తిసోపాన సాధనముగా ఆమోద సంజ్ఞక మోక్షభేద ప్రాపణమునటలో విప్రతి పత్తిలేదు.

# దివ్యానుభూతి

శ్రీ విఖనస గురుభ్యోనమః

శ్రీ మహీభ్యాంచ సహితమ్ - శ్రీవత్స మణిభూషణమ్ ।
భావనారాయణమ్‌దేవమ్ - భజే భావపురీశ్వరమ్.

ఆగమాచార్య, పండిత శ్రీమాన్ నల్లూరి విఖనస భట్టాచార్యులు - నల్లూరు

భావపురమున భక్తులనుద్ధరించి, ధర్మస్థాపనకై స్వయంవ్యక్త అర్చామూర్తిగా అవతరించిన శ్రీ రాజ్యలక్ష్మీ సమేత భావనారాయణస్వామివారి పాద పద్మారాధకులు, గౌతమాన్వయ సంజాతులు శ్రీ వైఖానసశాస్త్ర పారంగతులు ఆయుర్వేద వైద్య శిఖామణులు, పౌరాణికులు, గ్రామ పెద్దలు, భక్తాగ్రగణ్యులు, విద్వత్కవులు, వాగ్గేయ కారులును అగు కీర్తిశేషులు, శ్రీమాన్ నల్లూరి రంగాచార్యస్వామివారి విరచిత "శ్రీహరి నామ కీర్తనలు" అను గ్రంథమును ఆమూలాగ్రముగ భక్తితో పఠించితిని.

భక్తి ప్రపూరితమైన ఈ గ్రంధము చదివినంతసేపు నా హృదయము శ్రీ భావ నారాయణస్వామియందు లగ్నమై దివ్యానుభూతిని ప్రసాదించినది. ఇందు మూడు భాగములు కలవు. 1. శ్రీహరినామ కీర్తనలు- ఇవి నలుబది ఎనిమిది. కొట్నాల పాటలు 2. తలుపుదగ్గర పాటలుకలవు. ఇవన్నియు వివిధ రాగతాళ సమన్వితములై గాయకులకు హస్తామలకములైనవి. 35వ కీర్తన శ్యామరాగము, ఆట తాళము "నా మొరాలించవదేమిసామి - కామజనక, నన్ను కరుణించవేమి" ఈ కీర్తన రంగా చార్యులవారి అనన్యభక్తికి తార్కాణము.

ఇక ఈజన్మ వరంపరచాలు. పునరావృత్తి రహితమైన మోక్షము ప్రసాదించ మని ప్రతిజీవి కోరదగిన కోర్కెను కోరి భక్తులందరకు హెచ్చరిక గావించినారు.

2. ఎదురుకోల రాయబారము- సీతారామ కళ్యాణమునకు ముందుగా జరిగిన సీతాదేవి జన్మవృత్తాంతము, శివధనుర్భంగము మొదలగు విషయములను చమత్కారముగా ప్రవేశపెట్టి నూతన ప్రక్రియగా రాయబారము జరిపించినారు. ఇందు వీరి చమ త్కృతులు గద్య రచనా వైశిష్ట్యము ప్రకటింపబడినవి.

3. ఆళ్వారులలో ప్రసిద్ధిగాంచిన శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్ర, శ్రీ వైష్ణవ తదియా రాధనా మాహాత్మ్యమును, సుమనోహరముగా వర్ణించి చదువరులకు పరిచయము చేయబడినది. 

శ్రీ రంగాచార్యస్వామి రచనలవలన భక్తులు తరింతురు. మా గౌతమాన్వయ కీర్తి చంద్రికలు విస్తరించినవి. అముద్రితముగానున్న ఈ గ్రంథరాజమును ముద్రించి

వంశ పురుషుల కీర్తిని ఇనుమడింపజేయుటకు దీక్షాకంకణ బద్ధుడగు మా సోదరుడు, ఉభయ వేదాన్త ప్రవర్తకులు, ఆగమాచార్యులు, 'వైఖానసాగమ వాచస్పతి' శ్రీ భావ నారాయణస్వామివారి ఆరాధకులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖ అర్చక పరీక్షలసంఘ సభ్యులును అగు నల్లూరి వేంకట సీతారామాచార్యులగారికి శ్రీ భావ దేవుడు ఆయురారోగ్యైశ్వర్యములను ద్విగుణీకృతముగా ప్రసాదించుగాక!

—o—

## మహనీయులు

శ్రీమాన్ డాక్టరు గంజాం రాఘవాచార్యులుగారు, M.B.B.S. ఒంగోలు
అధ్యక్షులు శ్రీ వైఖానస దివ్య సిద్ధాన్త వివర్ధనీసభ – తిరుమల

చిరంజీవి, వేంకట సీతారామాచార్యులకు ఆశీస్సులు.

ప్రముఖ వైఖానస పెద్దలు, కవులు, పండితులు, ఆగమవేత్తలు, వైద్యులు మంత్రశాస్త్ర ప్రవీణులైన మీ తాతగారిని నేనెరుగుదును. వారు శ్రీ భావనారాయణస్వామి వారి పాదపద్మారాధకులై, స్వామివారికే అంకితమొనర్చిన కొన్ని రచనలను లోగడ అత్యంత శ్రద్ధతో గౌతమ సోదరులుగా ఖ్యాతిగాంచిన మీ అన్నగారైన వేంకట రంగా చార్యులుగారు మీరు ప్రచురించి భక్తకోటి కందించియుంటిరి. మిగిలిన రచనలను సేక రించి ప్రస్తుత పరిస్థితులలో కష్టసాధ్యమైన ఈ ముద్రణను చేపట్టి ఈ గ్రంథమును వెలుగునకు తెచ్చి పూర్తిచేసినందులకు మీ కృషి ప్రశంసనీయము.

బాపట్లలో మీ తాతగారు ఆ రోజులలో మేడయింటిని నిర్మించి మేడ రంగాచార్యులు గాను, అనేక సభలలో గ్రామపెద్దలచేతను, న్యాయమూర్తులచేతను పలుమార్లు సువర్ణ కంకణములతో సన్మానింపబడి కడియాల రంగాచార్యులుగాను ప్రసిద్ధినందిన మహనీయులు ఆరాధ్యదైవమైన శ్రీ భావనారాయణస్వామివార్కి భక్తుల ప్రోత్సహించి శాశ్వత ఉత్స వాది కైంకర్యములకై, భూ, ధన వసతుల నేర్పాటుచేసి ఆలయ వైభవమును పెంచిన ఆరాధకులు. వీరి ధర్మపత్ని రత్తమ్మగారు చక్కని నేత్ర వైద్యము చేసెడివారు. ఆశ్ర యులకు ఆమె తన భర్తగారి బంగారు కంకణములనుండి ముక్కలు కత్తిరించి చాల మందికి వివాహములలో మాంగల్యమునకై దానమిచ్చిన పుణ్యసాధ్వి. వీరి దత్తకుమా రుడైన వేంకట్రాయాచార్యులగారుకూడా ప్రముఖ ఆగమ పండితులు, వైద్యులు, బాల వైద్య నిపుణులు. వీరి ధర్మపత్ని రాఘవమ్మగారు, వీరు నిత్యము అతిథి అభ్యాగత పూజ లొనర్చుచు పుత్రపౌత్ర పరంపరాభివృద్ధితో శోభించి వంశ గౌరవమును పెంచిన సాధ్వి. వారి ఆశీర్వాద బలమే మీచే ఈ సత్కార్యములను చేయించుచు పుత్రపౌత్రాభివృద్ధిగా మీ వంశాభివృద్ధికి కారణమని నా అభిప్రాయము. కలియుగ నాయకుడైన శ్రీ శ్రీనివాస మూర్తికి ప్రతిరూపమై మీ ఆరాధ్యదైవమైన శ్రీ భావనారాయణస్వామి సర్వదా సర్వథా మీకు ఇష్ట కామ్యార్థసిద్ధి నందించుగాక. —o—

# పుణ్య విశేషము

శ్రీ భావదేవాయనమః శ్రీ వేదాన్తదేశిక గురవేనమః

శ్రీమాన్ వంగీపురం రామాచార్యులు, ఎం. ఎ.
ప్రిన్సిపాలు [ ప్రాచార్యులు ] కేంద్రీయ విద్యాలయము
ఏర్ఫోర్సు స్టేషను సూర్యలంక - బాపట్ల 522 101

జీవాత్మ అంతిమ పరిణామము కైవల్యము. దానిని పొందుటకై ఎన్నో మార్గములు కలవు. అకుంఠితభక్తి అన్నిటిని మించును. భక్తిచే ప్రహ్లాదుడు శ్రీహరినే నాట్యమాడించాడు. తత్ఫలితమే శ్రీహరి అండపిండ బ్రహ్మాండములో అన్ని వస్తువులలో వ్యాపించిపోయాడు. భక్తికిబలము దృఢవిశ్వాసము. అది లేనిచో తన్మయత్వము లభింపదు. సంగీతజ్ఞానము, కవితాశక్తి, మధురముగా గానముచేయుట ఇవి యన్నియు పూర్వజన్మ సుకృతముచే నబ్బునవి. పుణ్యవిశేషముచే యీ గుణములన్నియు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారిని వరించినవి అనుటలో సందియములేదు.

సుమారు 30 రాగములచే హరినామ కీర్తనలు నల్లూరి రంగదాసులవారిచే రచింపబడినవి. వప్పగింతలపాట, కొట్నాలపాట, తలుపుదగ్గర పాట స్వామివారి కళ్యాణోత్సవ సమయమును సూచించును. శ్రీ స్వామివారి కళ్యాణము సాంకేతికముగ లోక కళ్యాణమునకే. ఎదురుకోల రాయబారమునందు శ్రీ సీతారామ కళ్యాణమును చతుర సంభాషణశైలిలో నడిపించినారు. తన్ను స్వామివారిభృత్యునిగా సంబోధించి శ్రీ వైష్ణవ సాంప్రదాయములో 'అడియేన్దాసన్' అను సామెతను ప్రకాశింపజేసినారు.

శ్రీ వైష్ణవ ధర్మసూక్ష్మమను చక్కగా తెలుపునది తిరుమంగయాళ్వారు చరితము. 'సర్వేశ్వరుంగైన శౌరికింకరుజేరు ధనమున్నదేభక్తి ధనముగాక' అను భాగవతములోని వచనమును ఉటంకిద నిరూపించును. నీలుడు మ్లేచ్ఛుడు కుముదవల్లి తప్పిపోయిన అప్సర. బ్రాహ్మణ గృహములో పెంచబడినది. ఆమెను భార్యగా పొందుటకై నీలుడు భగవద్భక్తి పరాయణుడై, వైష్ణవారాధనచేయుచు, వారిని తృప్తిపరచుటకై దారికొట్టి అయినను ధనమార్జించుటకు పూనుకొన్నాడు. తుదకు శ్రీమన్నారాయణునితో యుద్ధమునకు దిగవలసి వచ్చినది. భక్తపరాయణుడైన శ్రీమన్నారాయణుండు, నీలుని కరుణించి అంతంబున సాన్నిధ్యము లభించునటుల వరమొసంగినాడు.

శ్రీ వైష్ణవ సాంప్రదాయమునందుగల మెలుగులను భక్తజనావళికందించి శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారు భగవత్కైంకర్యమును ఇనుమడింపజేసినారనుటలో సందియములేదు. భగవద్భక్తి పరాయణులెల్లరు ఆచార్యులవారి సేవను ఎన్నటికిని మరువలేరు.

—*—

# హృదయాహ్లాదము

శ్రీ మాతాజీ త్యాగీశానందపురి
శ్రీరామకృష్ణ భక్త సమాజం, బాపట్ల

శ్రీ సీతారామాచార్యులుగారికి, ప్రేమాశీస్సులు, నాయనా! మీ పితామహులచే వ్రాయబడిన "శ్రీహరినామ కీర్తనలు" పుస్తకం చూచాను. ఆనందం.

జీవితంలో భగవంతునికి ప్రథమస్థానం యిచ్చినవారు ధన్యులు. ప్రపంచానికి ప్రముఖస్థానం యిచ్చినవారు ప్రాపంచికులు. లౌకిక జీవితంలో ఉంటూ, భగవానుని మరువక, స్మరిస్తూ, భక్తితో తమ ఆరాధ్యదైవమైన శ్రీభావనారాయణస్వామిపై కీర్తనలను రచించి ధన్యులైనవారు మీ పితామహులు శ్రీ నల్లూరి రంగాచార్యులుగారు. కొన్ని కీర్తనలలో "సజ్జనాధార", 'పండితజనసత్ఫలదాయక' వంటి పదములకూర్పు ఆనందాన్ని కలిగిస్తున్నవి. "ఏమని దెల్పుదునే మనసా!... ' అను కీర్తనలో భగవంతుని మరచినవారిని గూర్చిన చింత, ఆవేదనలు గోచరిస్తాయి. మేలు కొలుపుల నుండి పవళింపు సేవవరకు గల కీర్తనలు మానవుని సర్వకార్యములు భగవదర్పితం చేయాలని సూచిస్తున్నవి. తలుపు దగ్గరపాటలో దశావతారముల జేర్చుట ఒక విశేషం. ఇక తిరుమంగయాళ్వారు జీవిత రచనముసగల దండకం, మందరధర! సుందరతర .. .... మొదలైన కంద పద్యములు హృదయాహ్లాదాన్ని కలిగిస్తున్నవి.

ఈ పుస్తకం ద్వితీయ ముద్రణను పొందటం ఆనందదాయకం. ఇందలి కీర్తనలను భక్తితోగానంచేస్తూ, శ్రీ భావనారాయణస్వామి అనుగ్రహాన్ని పొందుదుముగాక!

—o—

# భావపుష్టి

"త్యాగరాజ గురురేవ సదాగతిర్మే"
"కథాగాన కళాప్రపూర్ణ - సంగీత సాహిత్యభూషణ"
బ్రహ్మశ్రీ విద్వాన్ ములుకుట్ల సదాశివశాస్త్రి - తెనాలి

శ్రీమాన్ డాక్టరు నల్లూరి వేంకట సీతారామాచార్యులవారికి నమస్కారములు. మీరు పంపిన శ్రీహరి నామకీర్తనలు గ్రంథము ఆమూలాగ్రముగ చూచి చాల సంతోషించినాను. కీర్తనలు, చాల సరళముగా, మధురముగా, చక్కని నుడికారములతో, శబ్దాలంకారములతో అనుప్రాసలతోకూడి బహుఅందముగానున్నవి. భక్తినిరేకెత్తించుచున్నవి.

ఈ మహాకలిలో అన్నియు శృంగారములైన చౌకబారు సాహిత్యముతోగూడిన కీర్తనలేగాని భావపుష్టిగల సత్సాంప్రదాయముగల కీర్తనలులేవు. అందునను భగవదుపచార కీర్తనలు. ఇటీవలకాలమున రచించిన వారేలేరు.

మీ పితామహులైన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారిచే రచించిన పవళింపు సేవ కీర్తనలు, సువ్వి, ఎదురుకోల, శ్రీకృష్ణ, బాలక్రీడల వర్ణించిన కీర్తనలు, మంగళ హారతులు ఎంతో మధుర భక్తియుతములైయున్నవి.

ఈ కీర్తనలకు నిర్ణయించిన రాగతాళాదులుకూడ ఎంతో అందము చేకూర్చునవిగా యున్నవి. భక్తులు ఈ కీర్తనలుపాడి శ్రీ భావపురీశుని కృపాపాత్రులుకాగలరని విశ్వసించు చున్నాను.

....o....

ఆర్ష ధర్మ శిఖరాగ్రమునుండి వెల్లివిరిసిన

"హరినామ కీర్తన సుధ"

బృందావనం వెంకట రమణాచార్యులు, M A. (T.G T.)

ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ స్కూలు, నిమ్మకూరు - కృష్ణాజిల్లా

వేదశాస్త్ర విద్యలలో, వైద్య విద్యలో ఆధ్యాత్మిక విద్యలోవలెనే సాహిత్య విద్యలో సైతం "నల్లూరి" వంశంలో గట్టివారున్నారు. ప్రాచీన నవీన కవితా సౌరభాల సరస సమ్మేళనంగా రాణించిన 'అర్చావతార ప్రభావము' వంటి మధుర పద్య ప్రబంధాన్ని రచించిన కవివరేణ్యుడు మహాపండితుడు శ్రీ నల్లూరి రంగాచార్యులు, ఆకోవకే చెందినవారు.

1903 లో వారు రచించి ముద్రించిన "శ్రీహరినామ కీర్తనలు" నేడు పునర్ముద్రితములై వెలుగునకు వచ్చుట సంతసింపదగిన విషయము.

గద్యమైనా, పద్యమైనా, గేయమైనా, మృదు మధుర పదసంభరితమై సరస భావ సంపన్నమై అలరారినప్పుడే అది పది కాలాలపాటు నిలువ గలుగుతుంది. రసజ్ఞులయిన పండితుల, సహృదయులయిన పాఠకుల గుండెలలో పీఠము పెట్టగలుగుతుంది. రచయిత గురు శుశ్రూషతో, స్వయంకృషితో, జన్మాంతర సంస్కార బలముతో సముపార్జించుకొన్న ప్రతిభా పాటవముకలవాడైనప్పుడే కవితలో ప్రజ్ఞద్యోతకమౌతుంది.

ఇతి వృత్తము దైవచింతనామయమై ఆధ్యాత్మిక భావ ప్రబోధకమైన తరి కవి ధన్యుడగుట నిస్సందేహము. కవిత చరితార్థమగుట నిస్సంశయము. "శ్రీహరినామ కీర్తనలు" వాస్తవముగ పైన పేర్కొనబడిన అంశములకు పరిమితమైయుండుటవలననే సుమారుగ తొంబది యేండ్లు గడచిన పిమ్మట నేడు మరల ముద్రితమై ఆధునిక గాయకుల మన్ననలకు పాత్రము కాగలుగుచున్నది.

గ్రంథకర్త పద సంపదపై పరిపూర్ణాధికారముగల భక్తశిరోమణి, ఆయన భావ నారాయణస్వామివారిని పలురీతుల కీర్తించుటకై సాగించిన ప్రయత్నములో అందమైన, మకరంద సదృశమైన, పదములగుంపు వారి కనుసన్నల నడచి కమనీయతను, రమణీయతను చిందించుట విశేషము.

"బాపట్ల నివాస! నల్లూరి రంగధాసార్చిత సువిలాస!" ప్రతి కీర్తన చివర చక్కని అంత్యాను ప్రాసలతో అలరారెడి యిట్టి మకుటములెన్నియో! యీ గ్రంథమునగలవు.

ఆర్తితోగూడిన అభ్యర్థన ప్రతి కీర్తనయందును హృద్యముగ నివేదింపబడినది.

"ఏమని తెల్పుదునే మనసా! రాముని మరచిన పామరనరులకు

సామిని మనమున ప్రేమతో దలచక, నీమముచెడిన నిర్భాగ్యులకు" ఏమని॥

మొదలగు కీర్తనలలో ముద్దయిన నడక - నడకకు ప్రాణముపోయు మాటలు - మాటల మధురిమను వ్యక్తీకరించు భావాలు పోటీలుపడి పరువెత్తుచున్నవి.

"భజరే శ్రీకృష్ణం హేమానన, భజరే శ్రీకృష్ణం—
అజముఖ వినుతం; అద్భుత చరితం; సుజనార్చిత నవసుందర భరితం—"

వంటి కీర్తనల సరళిలో పూజ్య నారాయణ తీర్థులవారి తరంగ భంగిమలను గ్రంథకర్త గుర్తునకు దెచ్చుచున్నారు.

"రామా! అని అనవే! ఓ మనసా! అప్పుడేమి కోరినను ప్రేమతో నొసగును ॥రామా॥" ఆధ్యాత్మిక వైఖరికి ఆలంబనాలుగా నిలిచేయిట్టి పంక్తులలో గ్రంథకర్తగారి ప్రగాఢభక్తి తత్త్వము ప్రస్ఫుటముగ కనిపిస్తుంటుంది.

తెలుగు పదాలమధ్య తత్సమాలు సంస్కృత సమాసాల నడుమ - తెలుగు మాటలు భావస్ఫోరకంగా చిత్రముగా చెలువమొలుకు తీరున జతపరచు కౌశల్యము కవికి కలదని నిరూపించుట కెన్నియో కీర్తనల నుదహరింప వచ్చును.

"జోరమ్య గుణధామ ! జోదనుజ భీమా!
జోనీరద శ్యామ! జోభవ విరామా! "

"నిలువుటద్దంబులు నలుగడలయందు వెలయగను మీసేవ విశదముగనిందు"
చెలువ మలరగ మేము సేవించి ముందు నిలిచి యుంటిమి ప్రోవు నెనరుంచియిందు''

పదములకుగల జీవశక్తిని పరిమళమును ప్రౌఢిమను; లాలిత్యమును క్షుణ్ణముగ గ్రహింప జాలిన కవివర్యులు మాత్రమే ఇట్లు వ్రాయగలరు. వారు వ్రాయునది లాలిపాటగావచ్చును. మంగళహారతి పాటగావచ్చును. స్తోత్రముకావచ్చును. అభ్యర్థనగావచ్చును. నివేదనగా వచ్చును. తదను గుణమగు శయ్యా విశేషముతో సాగిపోవుచుండుననుట తథ్యము.

''పంతమేలరా! నా సామి! దంతిరాజవరద! నీదు చెంతజేరియుంటి"

ప్రతి కీర్తనలో తగిన యమకము గన్పట్టుట మరొక విశేషము. భగవద్భక్తి పారవశ్యమున గ్రంథకర్త వెలువరించిన భావములు పావనములు భక్తజనగణ సంభావనములు.

కవిగారు సంగీత శాస్త్రమునగూడ ప్రావీణ్యముగలవారేమో! కీర్తనల కన్నింటికిని రాగతాళములనుగూడ నిర్ణయించియున్నారు.

ఇట్టి ఉదాత్తాంశములతో కూడుకొనియున్న శ్రీహరినామ కీర్తనముల కనుబంధముగ శ్రీ స్వామివారి "ఎదురుకోలు రాయబారము" జతపరచినారు. ఇందలి గద్య పద్య భాగాలు గ్రంథకర్తయొక్క పాండిత్యానికి నిదర్శనాలు.

"తిరుమంగయాళ్వారు చరిత్రము" ఇందు పొందుపరుపబడిన మరొక రచన. సీస, వృత్త, కంద తేటగీతి ఆటవెలది పద్యములిందు సుందరముగనున్నవి. కథా భాగము మనోహరము. ప్రాచీన రచయితయని చెప్పినప్పుడే తెలియులీల నవతను పుంజుకొని వినూత్న సాహిత్య దీప్తులను ప్రసరించుచున్న - ఈ కావ్యమును గ్రంథ కర్తగారి పౌత్రులు శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారు పునర్ముద్రణ గావించి వంశీయుల దివ్యాదర్శమును సఫలీకృత మొనర్చినారు. ఆధ్యాత్మిక సాహిత్య శాఖలకు చెందిన విలువలు కోకొల్లలుగాగల యిట్టి గ్రంథములు నేడు సమాజమున కెంతగనో అవసరము. ప్రచురణ కర్తల కృషిని హృదయపూర్వకము నభినందించు చున్నాను. శుభమ్.

—o—

శ్రీ గురు శరణమ్

# మనోహరము

"పౌరాణిక సార్వభౌమ" పురాణోపన్యాస కేసరి
శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారు
శ్రీ శృంగేరి జగద్గురు మహా సంస్థాన విద్వాన్
1-10-1/13 అశోకనగర్ హైదరాబాదు, 500020

శ్రీమాన్ డాక్టర్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారికి నమస్కారములు ఆర్యా. తమ పితామహులు శ్రీమాన్ నల్లూరి రంగాచార్య భక్త కవి వరులు రచించిన గ్రంథము నేను చదివితిని. అందు హరినామ కీర్తనలు, ఎదురుకోల రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రము (ఏకాశ్వాసము) పరిపక్వభక్తి భావపుష్టములై పరమ కవితా మనోహరములై భాసిల్లుచున్నవి. ప్రబంధ కవిత్వము వైభవముతో నొప్పుచూ సరళమైన రసస్ఫూర్తితో వాగ్దేవీ విలాసముల నొలికించుచున్నది. మరియు మంగయా శ్వారు చరిత్రమున ఇట్టి - కృతులను భాగవత మహావైష్ణవ మహాజనులకు మహోపకార ముగ మీరు ముద్రించి అందించుట మీపితామహులపట్ల తమ భక్త్యాదరములు చూపుట యేగాక సజ్జనుల కుపకారకమగును. ఇంకా ఇట్టి రచనలున్న ప్రకటింతురుగాక.

—o—

# ఆకాంక్ష

డాక్టరు శ్రీమాన్ నారాయణం సత్యనారాయణాచార్యులు
జిల్లా కుటుంబ సంక్షేమము మరియు మాతాశిశు ఆరోగ్య అధికారి
(Medical Officer F.W.D Sivaganga)
వలంగిమాన్-తమిళనాడు తంజావూరుజిల్లా [మకాం సంగం జాగర్లమూడి]
శ్రీమాన్ సీతారామాచార్యుల బావగార్కి శుభాకాంక్షలతో

మీరు ప్రేమపూర్వకముగా పంపిన భక్తిరస గ్రంధమును చదివితిని. లోగడ మీరు ప్రచురించిన శ్రీ భావదేవ సుప్రభాతాది గ్రంధములందలి స్తోత్రములన్నియు నిత్య పారాయణకెంతయో ఉపయుక్తముగా యున్నవనుటలో అతిశయోక్తిలేదు. అటులనే ఈ గ్రంధములోని భక్తిప్రసూనములను భక్తితో పఠించితిని. తిరుమల శ్రీ వేంకటేశునిపై అత్యంత భక్తితోపాడిన అన్నమాచార్యులవారివలెనే శ్రీ భావదేవునిపై మీ పితామహులు శ్రీరంగదాసులు పాడిన కీర్తనలు మిక్కిలి రమణీయముగనున్నవి.

పరమాత్మమీద మనసులగ్నము చేయుటనే భక్తి అందురు. భక్తియొక్క పరమ లక్ష్యము; పరమాత్మ సన్నిధికిచేరుట పరమాత్మకుగల సహస్రాధిక నామములలో శ్రీ భావనారాయణస్వామి ఒకటి. భక్తజన పారిజాతమైన శ్రీ భావదేవుడు స్వయంవ్యక్త అర్చామూర్తిగా నెలకొని గత పద్మాలుగు శతాబ్దములుగా తన కరుణా కటాక్షములను భక్తజనులకు వెదజల్లుచున్నారు. ముఖ్యముగా వారి పాదసేవయే పరమావధిగానెంచి నిత్యనైమిత్తిక పూజలతో సేవించిన శ్రీ వైఖానస వంశీయులపై శ్రీవారి కటాక్ష వీక్షణము ప్రసరించినది. ఈ గ్రంధకర్త శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులువారు ప్రముఖ వైఖానస పండితులు. వీరి రచనలను మిక్కిలి శ్రమతో పునరుద్ధరణముచేసి ప్రచురించి భక్తకోటి కందించు మీ సేవకు నా కృతజ్ఞతాభి వందనములు.

ప్రస్తుత క్లిష్ట పరిస్థితులలో మన వంశీయులందరిని ఒకే త్రాటిపై నడపుటకు మీరు చేయుచున్న కార్యక్రమములు మిక్కిలి కొనియాడ దగినవి. మన వైఖానస వంశీయులలో బహుముఖ ప్రజ్ఞశాలులైనవారి ప్రతిభను గుర్తించి వారిని తగిన రీతిని సన్మానించుట మన కర్తవ్యమని నా ఆకాంక్ష.

మీ సంఘసేవా తత్పరత స్వసంఘీయ ఆపేక్ష సామాజిక కృషి నిర్విఘ్నముగా కొనసాగుటకై కావలసిన ఆయురారోగ్యైశ్వర్యములు మీకు కలుగజేయాలని నిత్యము శ్రీ భావదేవుని ప్రార్థించు చున్నాను.

— ౦ —

# సంతోషదాయకము

శ్రీమాన్ పెద్దింటి రంగనాథము, M.S.C.,M.Fil
లెక్చరరు, వృక్షశాస్త్ర శాఖాధిపతి
R. V. V. N. కళాశాల, ధరణికోట - అమరావతి

శ్రీమాన్ సీతారామాచార్యులగార్కి నమస్కారములు

మీ పితామహుల రచనలన్నింటిని భక్తకోటి కందించ సంకల్పించి మీరు మీ అన్నగారు కలసి చేసిన కృషి ఫలితముగా కొన్నింటిని లోగడ అందించినారు. మీ అన్నగారైన శ్రీమాన్ డాక్టరు నల్లూరి వేంకటరంగాచార్యులుగారు కీర్తిశేషులయిన తర్వాత నేటికి మీరు ఈ గ్రంధమును మరల భక్తలోకమున కందించుటకై కృషిచేసి పూర్తిచేయుట సంతోషదాయకమైయున్నది.

ఇందులోని మూడు భాగములు త్రిగుణాత్మకముగా నున్నవని నా భావన. సత్త్వగుణ ప్రధానుడైన పరమాత్మను కీర్తనలద్వారా సాత్త్వికారాధనచేయు సత్త్వగుణముగను, వివాహమునకు పూర్వాంగముగ వేడుక జరుపు ఎదురుకోల రాయబారము, రజోగుణ ప్రధానముగాను, తమోగుణ ప్రధానుడైన నీలుని జీవితమందలి మార్పులను ప్రబంధముగా రూపొందించిన కధ తమోగుణ ప్రధానమై పరమ పదముచేకేగిన తిరుమంగయాళ్వారు చరిత్రముగను కన్పట్టుచున్నది.

ఈ గ్రంధము త్రిగుణాత్మకమై గార్హస్థ్య జీవిత యాత్రలో కొట్టుమిట్టాడుచున్న జీవులకు చిత్త చాంచల్యమును బోగొట్టి భక్తిబీజములను నాటి మనశ్శాంతిని చేకూర్చి మహోన్నతి నందజేయగలదనుటలో అతిశయోక్తిలేదు. పరమపదనాధుని పదారవిందముల నాశ్రయించిన నీలుడు తిరుమంగయాళ్వారుగామారి పన్నిద్దరాళ్వారులలో ప్రధానుడై ప్రతివత్సరము శ్రీవారి బ్రహ్మోత్సవాదులలో "దొంగలదోపు" కథలో కథానాయకుడుగా కీర్తినందిన చరిత్రను, ఎదురుకోల రాయబారమును, భగవంతుని కీర్తించుటకై కీర్తనలను కలిపి ఒకే గ్రంధముగా అందజేసిన మీ కృషి, పాఠకులేగాక, భగవానునికి, పరమ పదమునమున్న మీ పెద్దలకు సంతోషదాయకమై ప్రకాశించునని నా నమ్మిక.

—o—



శ్రీః పాయాత్

# త్రివేణి

శ్రీ ప్రతాప సుబ్రహ్మణ్యశాస్త్రి, ఎం.ఎ.
తెలుగు లెక్చరర్ - వైకుంఠపురం - చీరాల

శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులగార్కి నమస్కారములు. తాము కోరినరీతిగా అభిప్రాయము త్రివేణి వ్రాసి పంపుచున్నాను.

చక్రహస్తుని ప్రకటించు చదువులు - గోవిందునిగూర్చి బోధించు గురువులు కరవైన ఈ కలికాలములో యశశ్శరీరులు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారు రచించిన శ్రీహరి నామకీర్తనలు - ఎదురుకోల రాయబారము - తిరుమంగయాళ్వారు చరిత్రము అను ఉత్తమ కవితలు వెలువడుట ముదావహము.

కృతికర్త సంస్కృతాంధ్ర భాషాకోవిదులు, సంగీత సాహిత్యములలో సవ్యసాచివంటివారు. శ్రీ వైఖానసాన్వయులు, గౌతమగోత్ర విరాజితులు, చక్రాని శబ్దాధికారముగలవారు. బాపట్ల శ్రీ భావనారాయణస్వామివారు వీరి ఇలవేలుపు, శ్రీవారి వంశ పరంపరా అర్చకస్వాములైన వీరి కవితలో "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" అన్నట్లు అంతటను వైష్ణవ సంప్రదాయము, సంస్కారము గోచరమగుచున్నది.

శ్రీహరినామ కీర్తనలకు భక్తిజీవనాడి. వీరి పదప్రయోగ చాతురివీనులకు విందు చేయుచున్నది. అర్థగాంభీర్యము రసోల్బణముగానున్నది. భావరాగలయాత్మకమగు వీరి కవితలు మెచ్చదగినవి.

జగదభిరామా! జానకిరామా! నిగమగోచరనామా! నిజభక్తకామా!

నీరదనిభగాత్రా! నిరుపమ చారిత్రా - సారసదళనేత్రా! సన్మౌనిజన మిత్రా!

ఇట్టి అంత్యానుప్రాసలు వీరి కవితలో ఎన్నో సహృదయ హృదయరంజకములు!

కరివరదా! భూరిసుగుణధామా!, భక్తపరాయణా!, భావనారాయణా! మున్నగు సంబోధనలు చదువరులకు మనోహరములై భాసించుచున్నవి. పుడమి ముద్దియ పమిడిగంపలు వంటి అచ్చిక సమాసాలు కవిగారి వైదుష్యమునకు నికషోపలములు.

కొట్నాలపాటలు నాటిమగువలు శ్రమాపనోదనమునకై పాడుకొనునవి. వానిలో అచ్చపు తెలుగుదనము కానవచ్చుచున్నది. సువ్వి సువ్వి యనుచు సుదతులు పాడు పాటలు పాఠకులకు ముదమును నివ్వటిల్లజేయుచున్నవి.

ఎదురుకోల రాయబారము తెలుగువారి వివాహపు వేడుక, సీతా కళ్యాణము ఇందలి ప్రధాన వస్తువు. కాబోవు వధూవరులు వీధులలో ఊరేగింపు చేసికొనుచు ఒక కూడలిలో ఎదురెదురుగా నున్నప్పుడు, సీతారాములగూర్చి ఉభయపక్షములవారు పరస్పరము చేసికొను ఆక్షేపణలు, సమాధానాదులు విజ్ఞాన ప్రదములుగానుండును. ఇందు జనకుని సచివులు, దశరథుని అమాత్యులు గావించిన రాయబారము ఆంధ్ర సంప్రదాయ లక్ష్మికి రత్నహారమైయున్నది.

తిరుమంగయాళ్వారు చరిత్రము, ఏకాశ్వాస ప్రబంధము. ఇందలి గద్యపద్య శైలి వర్ణనలు, మనుచరిత్రాదులకు ఏ మాత్రము తీసిపోవు. మరియు కృతికర్తకుగల మహోజ్జ్వల పాండితికి నిదర్శనములు. శబ్దాలంకారములు కుప్పతిప్పలుగానుండి కవితకు శోభాకరములైనవి. కుముదవల్లికి, నీలునకు జరిగిన సంభాషణలోని ఐతిహ్యములు చదువరులకు వివేక స్ఫూర్తిని కలిగించుచున్నవి. ఈ చరిత్ర సంప్రదాయ కవితాభిమానులకు చక్కనివిందు. ఉపదేశముతోపాటు ఆనందమును సమకూర్చిన రచయితయు వ్యయప్రయాసను సహించి వెలువరించిన కృతికర్త పౌత్రులు డాక్టరు, ఆగమాచార్య "వైఖానసాగమ వాచస్పతి" నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారును శ్లాఘనీయులు.

ఈ రచనకు బహుళ ప్రశస్తి లభింపగలదని ఆకాంక్షించు చున్నాను. క్వాచిత్కముగా దొరలిన అక్షర దోషములు సవరించుకొన్నచో సామాన్యులకును ఈ గ్రంథము జ్ఞాన వైరాగ్య ప్రబోధకముకాగలదు.

ఈ కవితాత్రయమును "త్రివేణి" అనుట బాగుండును

'తద్విష్ణోః పరమంపదమ్'

తేజస్వి నావధీత మస్తు.

....o....

# ఆనంద భాషణము

శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు
Emeritus Fellow
Litarary and Performing Arts Govt of India
కామాక్షినిలయం 26-3-13 గాయత్రీనగర్
నెల్లూరు-4 పిన్‌కోడ్ 524004

శ్రీరంగదాసు ముద్రతో శ్రీమాన్ నల్లారి రంగాచార్యులవారు వైభవోపేతంగా రచించిన శ్రీహరి నామకీర్తనలు, కొట్నాల పాటలు, ఎదురుకోల రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రము అను నాలుగు దివ్య రచనలుగల గ్రంధము నాద్యంతము చదివే సువర్ణావకాశం నాకు లభించింది. శ్రీ రాజ్యలక్ష్మి సమేత భావనారాయణస్వామి వారి దివ్యలీలలను, విభూతులను, లోకరక్షణ దీక్షను కీర్తించే ఈ నాలుగు రచనలు శ్రీమన్నారాయణుని లీలావిలాస విభ్రమావిర్భావ దివ్య మంగళవిగ్రహాన్ని హృదయంలో హత్తుకొనేటట్లు చేయగలిగిన ప్రభావంతో అలరారుతూవున్న రసగుళికలు.

నిగమ నీరజామృతజ పోషకుడైన సత్కవి హృదాలయుడు, ఆ శ్రీమన్నారాయణుడు. భావములోను బాహ్యమునందునూ ఆ గోవిందుని లీలలే కనుగొని ఆనంద సాగరంలో ఓలలాడడానికి సాధనాలుగా శ్రీమాన్ రంగాచార్యులవారు ఈ ఖండికలు రచించారు. "హరినామ స్తుతిజేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీసురుచి భ్రాజితమైన మానస సరస్ఫూర్తిన్ వెలుంగొందు„ అని శ్రీ పోతరాజు వివరించిన ఆదర్శానికి అనుభవం గలిగించే ఈ రసగుళికలు భక్తిని, రక్తినిగూర్చి ముక్తి సాధించే శక్తిని ముముక్షువులకు కలిగించేవిగావున్నవి.

రచయితకుగల సంగీత సాహిత్య సమదృష్టి సామర్థ్యం హరినామ కీర్తనలలో ప్రతిబింబిస్తున్నాయి. సురట, జంఝూటి, బేహాగ్, శ్యామ, రాగాలలోని రచనలు సంగీత సాహిత్య విలసితాలై సువర్ణానికి సుగంధం అబ్బినట్లు శ్రీ భావనారాయణుని ఆరాధనా విశేషశోభితములై దివ్యానుభూతి కలిగిస్తూవున్నాయి.

భక్తిభావంతో నిత్యకృత్యంగా పాడే కొట్నాల పాటలు ఇంటింటా ప్రతి పనిలోనూ ఆ భగవత్కైంకర్యాన్ని దర్శింపజేసి సర్వదా సర్వధా ఆ భగవంతుని సాన్నిధ్యములో ఉన్నట్లు అనుభవం కల్గించగలవు. వివాహాల్లో జరిగే ఎదుర్కోలు రాయబారాల్లోని ఆధ్యాత్మికమైన సందేశం వీరు రచించిన ఎదురుకోల రాయబారంలో ప్రస్ఫుటంగా వున్నది.

తిరుమంగయాళ్వారు చరిత్రము ఈ రచనలన్నిటిలో మకుటాయమానంగావుంది. నీలుడు, పరకాలుడనే నామాంతరమున భాగవతులను సేవించి ధన్యుడైన క్రమ వికాసాన్ని ఎంతో రసవంతంగా వర్ణించడం జరిగించి పద్యరచనలో లాలిత్యం, గాంభీర్యం, ఔచిత్యం, ధారాశుద్ధి చదువరులను ఇట్టే కట్టివేసి చివరవరకు ఒకేపట్టులో చదివించ గలిగివున్నాయి. దృఢదీక్షతో వైష్ణవ సేవచేసి తరించిన పరకాలుని పలుకులు గ్రహింప దగియున్నవి.

కం॥ వనుమీరలు దండించిన
ఘనమగు నీసువ్రతము గడుపగజాలన్
అనయము తవదాసాన్ దా
సునిగా జేపట్టి గృపనుజూడు రమేశా॥

శరణాగతి ప్రధానంగాగల యీ రచన పాఠకులు చదివి ఆనందించి శ్రీ భావనారాయణుని తమ హృదయాలలో ప్రతిష్ఠించుకొందురుగాక - "ఆనందంతో"

—*—

## విశ్వాసము

శ్రీ భావనారాయణస్వామినేనమః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమాన్ కొమాండూరి ఇలయవిల్లి తిరువేంకట రామానుజాచార్యులు, ఎం. ఎ.

రంగారావుతోట - బాపట్ల, పిన్‌కోడ్ 522 101

మీరు సాదరంగా పంపిన శ్రీహరినామ కీర్తనలు - తిరుమంగై ఆళ్వారు చరిత్రము అనే గ్రంథాన్ని చాలా శ్రద్ధగా చదివినాను. చక్కని ధారాశుద్ధి భావ బంధం గల గ్రంథం అని ఆనందించాను. బ్రహ్మోత్సవాలలో "దొంగలదోపు" ఉత్సవ సమయంలో ఈ చరిత్రను చదివిస్తే సార్థకమౌతుందని నా అభిప్రాయం. అలాగే ప్రణయ కలహోత్సవ సమయంలో పాడదగిన పాటలుకూడ ఇందులో ఉన్నాయి. వాటిని గూడ పాట పాడగలిగేవారిని తయారుచేసి వైభవంగా ఉత్సవాలలో ఉపయోగిస్తే ఈ గ్రంథానికి తగ్గ మంచి ప్రచారం కలుగుతుందని, కలగాలని, నా విశ్వాసము.

....o....

# చంద్రునికొక నూలుపోగు

గాన కళాప్రపూర్ణ 'సంగీత సాహిత్య కళానిధి'
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు - ఆకాశవాణి
గోవిందరాజులు వీధి - సూర్యాపేట - విజయవాడ - 520002

శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగార్కి ప్రణామములు. మీ పితామహులు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు రచించిన గ్రంధములు శ్రీహరి నామ కీర్తనలు, ఎదురుకోల రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రము అను విషయ సంకలన గ్రంధము నేను చూచితిని. ఇందు కీర్తనలు సంగీతమునకు యోగ్యమైన మృదు మధుర పదజాలముతో కూర్చబడి, భక్తులకు, సహృదయులకు, ఆనందకరముగానున్నవి. రచయిత గేయశిల్పము బాగా తెలిసినవారైనట్లు గోచరించినది.

పూర్వకీర్తన కర్తలగు, వేంకటాద్రిస్వామి, రామదాసాదుల భక్తి తాత్పర్యములీ కీర్తనలందు తొణికిసలాడుచున్నవి. రాగతాళములుకూడ రసానుగుణముగ నిర్దేశింపబడి, గానభావులకు, అరటిపండు ఒలిచి చేత పెట్టినట్లుండుట చాల ముదావహము.

సీతాకళ్యాణమునకు పూర్వరంగమైన ఎదురుకోల సన్నాహమందలి పద్యములు వచనములు, దండకములు, ఒక నూత్న పద్ధతిలో నడచి హృదయము నాకట్టుకొనుచున్నవి. ప్రస్తుతం సీతాకళ్యాణము హరికథ చెప్పెడి విద్వాంసులు ఈ రచనమును జోడించుకొనిన నెంతో మనోజ్ఞముగానుండునని నాతలంపు. కవిత్వమా? ప్రతిపద మనోజ్ఞము. గ్రంధమా? నాతి విస్తృతమునై చాల బాగున్నది.

ఇతి తిరుమంగయాళ్వారు చరిత్రము చక్కని ప్రబంధము. "నబయ నీ ముఖము.తో సరిరాక చంద్రుండు ఘనమార్గమానకేగి కళలుదప్పె." వంటి పద్యములు. కవి గారి భావనాబలమున కుదాహరణములు పరిమితి చిన్నదయినను పరిణితి గొప్పదే! పూర్వులు పల్లవ గ్రాహిపాండిత్యమున తృప్తిపడక విద్వత్కవులగుటకే ప్రయత్నించెడివారు.

శ్రీమాన్ రంగాచార్యులవారు, విద్వత్కవులు, చక్కని ప్రబంధము నందించిన వారికి నా నమశ్శతములు. నేను ఈ వ్రాసిన మాటలు చంద్రునకొక నూలుపోగువంటివే!

—*—

# అభిప్రాయము

సంగీతభూషణ - వాగ్గేయకారరత్న

శ్రీ శిష్ఠ్లా సత్యనారాయణ రాజశేఖరం [మానవతార్]

అధ్యక్షులు - భావపురి సంగీత సభ

కోటవారివీధి, రైలుపేట - బాపట్ల-522 101

ఉ॥ శ్రీలకు మూలమౌ విఖనసీయ సువైష్ణవ సంప్రదాయ సం
చాలకుడౌః రంగకవిచంద్రుడు శ్రీహరికీర్తనమ్మెదుర్
కోశల రాయబారము విరోధియముల్ తిరుమంగయాళువార్
శీలము కావ్యబద్ధ మొనరించెను, తన్చెను విష్ణుదేవునిన్.

ఆ. వె. విష్ణువెవడు, తాప్రవేశింపగోరు వ్యా
మోహియకదయెల్ల బుద్ధులందు
భావపురమునందు భావనారాయణ
స్వామి "మాలును మణివణ్ణుడ" కద?

తే. గీ. లలిత లలిత పదాల్ నవరసయుతాల్ సు
మధురభక్తి భావాల్, పరమప్రయోజ
నాగమాల్ రంగయార్యుని రాగతాళ
బద్ధ భావదేవస్తుతుల్ భవహరాలు.

ఉ॥ మా చిననాటి పెండిలి క్రమంబులు దైవపరంబులయ్యె సం
కోచము లేకయుం, దెదురుకోల్ మరిమాదలు తోటడిగ్గుటల్
పూచికపుల్ల శైవధనువుల్ విరిపించుట, లప్పగింత పాల్
పేచనచేయు చేతుల వరీయుల బంధుల చేతులొత్తుటల్.

కం॥ ఏతత్ కృతి-కర్తృకులో
ద్భూతుడు శ్రీ సీతారాము పుణ్యమున బున
ర్భూతంబయి_లోకులకుం
జేతోమోదంబు శుభముజేకుర జేయున్॥

....o....

# విన్నపము

"సాహిత్య కళాతపస్వి"

జి. వి. జ్వాలా నరసింహశాస్త్రి, బి.కాం; బి.యల్. అడ్వకేటు – నోటరీ
చీరాల – బాపట్ల

సాగరశీతల సమీరములు, ప్రక్కనే అరణ్యమందున్న వివిధ తరులతా వితానములను ఒరుసుకొంటూ, కమ్మని వాసనలను మోసుకొంటూ, ఉత్తరదిశగా పయనించి, భావపురీ పవిత్రక్షేత్రానికి ప్రశాంతతను సంతరిస్తున్నాయి.

అచ్చట క్షీర వృక్షంనుండి స్వయం వ్యక్తమైన శ్రీ స్వామి, క్రిమికంఠచోళ ప్రభువుచేత క్రీ. శ. 594 సం॥లో ఆలయ నిర్మాణం చేయించుకొని, శ్రీ మత్సుందర వల్లీ రాజ్యలక్ష్మి సమేతుడై "బావదేవ" రూపంలో సాక్షాత్కరిస్తున్నాడు.

బ్రాహ్మీముహూర్తముననే మేల్గాంచి, నిత్యకర్మానుష్ఠానము ముగించుకొని, పట్టు పీతాంబరాలు ధరించి, బంగరుకుండలాలు, శిఖాయజ్ఞోపవీతములు కలిగినవాడు, శరీరము నిండా తిరుమణి తిరుచూర్ణంతో మెరసిపోతూన్న బ్రహ్మతేజమువాడు, నల్లూరి వంశాన్వయుడు, అత్యంత శ్రద్ధాసక్తులతో, వినమ్రుడై, కోవెలలో కొలువుదీర్చినస్వామికి నిత్యార్చనలను, సశాస్త్రీయంగా చేస్తున్నాడు.

ప్రాతఃకాలపూజలు, మాధ్యాహ్నికార్చనలు, సాయంకాలసేవలు, స్వామి స్వీకరిస్తున్నాడు.

నిత్యోత్సవాలు, మాసోత్సవాలు, సంవత్సరోత్సవాలు, బ్రహ్మోత్సవాలు, కళ్యాణోత్సవాలు జరుగుతూనేవున్నవి. రంగురంగుల కుసుమాలు, ఘుమఘుమలాడే పుష్పగుచ్ఛాలు, తనకు ప్రీతికరమైన తులసీదళ దామాలు, దేవపారిజాతాలు, నవరత్న ఖచిత సువర్ణాభరణాలతోపాటు అలంకరిస్తుంటే, రుచులూరే భక్ష్య భోజ్య భోజనాలనూ స్వాదుతర రసాలనూ ఆరగిస్తూ, సుఖాసీనుడై, శుచిస్మితుడై సుప్రసన్నుడై, తన దయామృత తరంగిణులతో, భక్తుడిని తన్పుతున్నాడు.

ఆ దివ్యమంగళ విగ్రహాన్ని చూచుకుంటూ, సేవిస్తూ,

"కలుగునా యిటువంటి సేవ! అందరకు కలుగునా యిటువంటి సేవ!

" అని మురిసిపోతూ పారవశ్యంతో ఉప్పొంగిపోతున్నాడు, ఆచార్య సత్తముడు!

వీరిద్దరికి మధ్య పెత్తందారీ చెలాయించే అధికారులువుండి ఉండరు. స్వామి ఎల్లా ప్రవర్తించాలో, అర్చకుడు ఎల్లా నడుచుకోవాలో నిర్ణయించిన విధి నిషేధములను సూచించే శాసనాలువుండి ఉండవు. కొంగ్రొత్త నిబంధనలను పుట్టించి, పూజాకార్యక్రమాలను, "టిక్కట్ల"ద్వారా "పర్మిట్ల"ద్వారా నిర్దేశించే సర్కారీ దళారీలూ, కోవెలలో స్వామి స్వీకరించే కానుకలనూ ఆయన తీర్థ ప్రసాదాలనూ లెక్కలుకట్టి, తూకంవేశీ, విలువకట్టి సాహసించే పాలకులు, హుండీలుపెట్టి భక్తులర్పించే ద్రవ్యాన్ని బేరీజువేసే కృతక నియంత్రణంవుండి ఉండదు.

ఒక్కమాటలో - భక్తపరాధీనుడైన స్వామికీ, అర్చకుడైన భక్తునికీమధ్య నిర్బంధాలు, తెరలువుండవు.

ఆ స్వామి ప్రభువైతే - తాను భృత్యుడు
ఆయన దైవమైతే - తాను భక్తుడు
ఆయన తండ్రి అయితే - తను తనయుడు
ఆయన సఖుడైతే - తను సఖి!

కొంత మార్పులు చేసుకుని,

అర్చకస్వామి తండ్రిగా వ్యవహరిస్తాడు
అప్పుడు స్వామి తనయుడై పోతాడు
అర్చకస్వామి తల్లిగా మారుతాడు
స్వామి, మారాముచేసే కొంటె శిశువుగా ఆడగలడు

దశరథునివలె, జనకునివలె, యశోదవలె, రాధవలె, నందగోపునివలె, అర్చకుడు భావించటమే తడవుగా, శ్రీ స్వామి రామునివలె, గోప కిశోరునివలె, పెండ్లికుమారుని వలె రూపు దాలుస్తాడు. ఆయనతోపాటు అమ్మవారుకూడా నవ వధువువలె ప్రవర్తిస్తే ఆశ్చర్యపడ నవసరంలేదు.

ఎల్లవేళలా, ఉభయులమధ్యా, సరస సల్లాపములు, ముద్దు మురిపెములు, చిఱు కోపములు, అలకలు, ఓదార్పులు బుజ్జగింపులు, మధుర భాషణములు, సంకీర్తనలు, నుతిస్తోత్రములు!

ఇవి వారి ఆ నిర్వచనీయ పవిత్రానుబంధమందలి వివిధ కలాపములు!

ఈ విధంగా భావదేవుని ప్రసాదమును పుష్కలంగా పండించుకొన్న మహిమాన్వితుడు. శ్రీమాన్ నల్లూరి రంగాచార్య మహోదయుడు! ఆ భక్తిమయ ప్రపంచంలో ఎంత రక్తివుందో, ఉక్తిమయ ప్రపంచం ద్వారా అనూదితంచేయగా మనకు ప్రాప్తించిన గద్య పద్య కీర్తనామయ కృతి - యీ సుకృతి!

సర్వోన్నిద్రతమైన సర్వ కవితా సంభారమున్ నీకు, నై
వేద్యం బిచ్చితి "భావదేవ ప్రభువా! "విశ్వాసము బూనవే
ఆద్యంబై చను జీవలక్షణము సంహారమ్ము గావింపవే,
హృద్యంబై చను నీదు తేజమును సాకింపంగదే గుండియన్" (విశ్వనాధ)

అని పరమ భాగవతోత్తముడు చేసుకున్న వినతి యీ గ్రంధం నిండా ధ్వనిస్తున్నది.

అట్టి భక్తి పారవశ్యంగల మహామహుని కవితా మాధుర్యాన్ని, తూకం వేయడానికి, తులనాత్మక సమీక్ష చేయడానికి, కేవలం పాండిత్యం చాలదు. భక్తి కావాలి. ఆ స్థాయి నాలో ఉందనుకోను అందుకే నేను అనర్హుడను.

కానీ శ్రీ భావనారాయణస్వామివారి దేవస్థాన వంశ పరంపరార్చకుడు, విద్వద్వరేణ్యుడు, భిషగ్వరుడు ముఖ్యంగా నాకు ఆత్మీయుడు అయిన శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులవారు, పునర్ముద్రణ ద్వారా యీ అపూర్వ గ్రంధరాజమును ఆంధ్ర భక్త జనులకు అందించే మహత్కార్య భారాన్ని వహించిన విషయం - నాచేత యీ వ్రాతలు వ్రాయించినది.

శుభం భవతు "జ్వాలాశాస్త్రి"

# అభిహోరికము

శ్రీయైనమః

ఆగమాచార్య పండిత శ్రీమాన్ వేదాంతం పార్థసారధి భట్టాచార్యులు

రిటైర్డు తెలుగు పండితులు - తెనాలి, గుంటూరుజిల్లా

శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్య పితృవ్యులకు వందన సహస్రములు. మీరు ప్రేమతో పంపిన కీ॥ శే॥ ఆగమాచార్య శ్రీ వైఖానసాగమ సరస్వతి, భిషగ్రాజ శిరోమణి "పండిత నల్లూరి రంగాచార్యస్వామి విరచిత "హరినామ సంకీర్తన" మను పొత్తమును సాకల్యముగ తిలకించితిని. అందు "హరినామ కీర్తనలు" ఎదురుకోల రాయబారము, శ్రీ తిరుమంగైయాళ్వారు చరిత్ర మున్నగు అమూల్య తర విశేష విషయ ములగాంచి అమందానంద కందళిత హృదయుడనైతిని.

కళయన సౌందర్యము. మానసికానంద సంధాయకము. భారతీయ చతుష్షష్ఠి కళ లలో లలిత కళలైదును ఉత్తమములు. వాని పరిమాపధి ఆనంద సంధాయకత్వముతో బాటు శాశ్వత మోక్షానందమును గల్గించుటయు అయియున్నది. ఆమోక్షానందమును చేకూ ర్చుటలో భక్తిరసము ప్రధాన పాత్రవహించుచున్నది. ప్రేమకు మారు రూపము భక్తి. భక్తునకు భగవంతునకు మధ్యగల అవ్యాజ ప్రేమము భక్తియనబడుచున్నది.

ఆ ప్రగాఢ భక్తికి ఆదిలో నృత్తము, పిదప నృత్యము, అటుపై నాట్యము అను నవి ప్రధాన ప్రేరణ కారకములగుచున్నవి. అవి మిక్కిలిగ ప్రజాదరణమును బొంది యున్నవి. గానమునకు వశముగానిది లోకమందేదియునులేదు. అందువలననే"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణిః" అన్నారు పెద్దలు. ఈగానమువలన ఐహిక, ఆముష్మి" కములు రెండును సాధ్యములు అగును. ఆగానమునకు ఒక ప్రాణము కవిత్వము, రెండవ ప్రాణము సంగీతము, మూడవ ప్రాణము భావనము, నాల్గవ ప్రాణము లయాన్విత పద ఘటనము, ఐదవ ప్రాణము కంఠమాధుర్యము. ఇట్టి పంచ ప్రాణాత్మకమగు సంగీత సాధనగావించి తరించిన మహాపురుషులు ముప్పురయ్యలు. ఒకరు త్యాగయ్య, రెండు అన్నమయ్య మూడు క్షేత్రయ్యలు ఆ కోవకుచెందినవారే మన రంగదాసుగారు

నాడు మురళీమోహనుని మురళీగానమునకు బృందావన గోగోప బృందంబు ఆనంద పరవశమైనది. శ్రీ త్యాగయ్య కవితాగాన మహిమచే సాక్షాత్తు శ్రీరామచంద్రుని దర్శించి పాలు త్రాగించారు. అన్నమయ్య శ్రీ శ్రీనివాసుని పులకిత గాత్రుని గావించి నాడు. క్షేత్రయ్య శ్రీ రాధాకృష్ణుల కృపాకటాక్ష వీక్షణముల బడసియున్నాడు. నేడు మన రంగదాసుగారు తమ హరినామ సంకీర్తన సుధారస ప్రభావమున శ్రీ రాజ్యలక్ష్మి సమేత భావనారాయణస్వామివార్ల యనుగ్రహ ప్రాప్తినందియున్నారనుట అతిశయోక్తిగానేరదు. అంతియకాక తమ సమకాలీనులగు వంశోద్భవులకు ఆదర్శ భక్తిరస ప్రపూర్ణ గ్రంధ నిర్మాతయై అంచిత యశోధనమును సమకూర్చి పంచియిచ్చిరనుట అతివాదము గాదు.

"శ్రవణం కీర్తనం విష్ణో స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం
ఇతి పుంసార్పితా విష్ణోభక్తిశ్చేన్నవ లక్షణా" అనునట్టి నవ విధ భక్తిభావముల మేలి కలయిక నలవరించుకొని యీ హరినామ సంకీర్తన గ్రంథమును విరచించి వారు ధన్యులయిరి. దానిసంకీర్తనమువలన మనలనుగూడ ధన్యజీవులగావించి యున్నారు. వారికి వారి వంశీయులకు నా శత సహస్ర వందనాలు అర్పించుకొను చున్నాడను. వారి సంగీత ప్రతిభకొనియాడ తగియున్నది. కవితా పద్ధతి కడుంగడు శ్లాఘనీయము. భక్తిరస నిష్యందతుందిలమగు భక్తి అనితర దుర్లభము. లయాన్విత రాగ తాళమేళనములు అనితర సాధ్యములు. వీరు ఆళ్వారులకోవకు వారసులై నిలచియుండిరి. భావపురి క్షేత్రమ హాత్మ్యమును, దివ్యస్తుతులను, రచించి హరినామ సంకీర్తనామృతమున దోగి శాశ్వత స్థిర యశఃకాయమును సమకూర్చుకొనిరనుటలో సందియములేదు. అది వారి ఆయుర్వేదశాస్త్ర పరిపూర్ణ పారీణతకు నిదర్శనము.

"మన్మనాభవ మద్భక్తోమద్యా జీమాం నమస్కురు
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోసిమే॥

అనునటుల కర్మయోగ ఫలసారమును, పరిపూర్ణ జ్ఞానయుక్తి శరణాగతి దృఢత్వము వీరి రచనలలో సుదృఢముగనిలచి పునరావృత్తి రహిత శాశ్వత మోక్షపదమును చేకూర్చి యుండవచ్చును. సంసార సాగర నిమగ్నులగునెల్ల శరీరధారులకు నుడుపమువలె రక్షకమైయున్నది. ఇల్లను చీకటి నూతిలోబడి దారితెన్నుగానని వారికిది కరదీపిక. కుటుంబ జంబాలపటలమగ్నులకు నిది విరుగుడునీరము. మోహాంధులకు జ్ఞానజ్యోతి స్ఫులింగము.

శ్రీ శ్రీ రంగదాసుగారు

"మయ్యా వేశ్యమనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయో పేతాస్తేమే యుక్తతమా మతాః''

అని పలికిన గీతాచార్యులకు అత్యంత ప్రీతిపాత్రులై శ్రీ భావనారాయణస్వామివార్ల అనుగ్రహ సాన్నిధ్య ప్రాప్తులబడసియుందురుగాకయని ఆశించు చున్నాడను. శ్రీ హరినామ సంకీర్తన" గ్రంథ ముద్రణమువలన శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులు గారు ఋణత్రయ విముక్తులు కాగల్గిరని తలంచు చున్నాడను.

మంగళమ్ మహత్

# అభినందనము

శ్రీమాన్ అర్చకం రామస్వామి దీక్షితులుగారు, తి.తి.దే. అర్చక మిరాశీదారు, తిరుపతి
ఉపాధ్యక్షులు, శ్రీ వైఖానస దివ్యసిద్ధాన్త వివర్ధినీసభ-శ్రీ వైఖానసాశ్రమము-తిరుమల

చాతుర్లక్షాత్మకముగా శ్రీమద్దివ్య వైఖానసాగమాన్ని సృష్టించి యిచ్చిన శ్రీ విఖనసాచార్యస్వామివారిని, శిష్యులైన శ్రీ భృగు, మరీచి, అత్రి, కశ్యప, మహర్షులనుగూర్చియు, వారు లోకమునకు గావించిన మహోపకారమును గురించి - బాపట్ల వాస్తవ్యులు - బహుముఖ పాండిత్య శోభితులు. కీర్తిశేషులు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు 1903 సం॥లో ప్రచురించిన మధుర కావ్యాన్ని 'అర్చావతార ప్రభావము" వైఖానసులకేగాక సర్వజనావళికి ముఖ్యముగా శిరోధార్యమైన గ్రంధము-ఇయ్యది మరల 1973 లో గౌతమ సోదరుల (గ్రంధకర్తగారి పౌత్రులు) కృషిచే పునర్ముద్రితమైనది. ప్రతులులేవు. శ్రీ విఖనసాచార్యులవారి చరిత్రనందించుటలో భారతావనియందు ఆంధ్రదేశము ముందడుగువేసినదనుట నిర్వివాదము.

శ్రీ రంగాచార్యులవారి శ్రీహరినామకీర్తనాదులు' పునర్ముద్రణగావించుటలో శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారి భక్తి శ్రద్ధాసక్తులను నేను హృదయపూర్వకముగా అభినందించు చున్నాను.

# చరితార్థుడు రంగదాసు

"ప్రతిష్ఠాచార్య" "విశ్వకర్మాగమవాచస్పతి", వంగిపురపు వీరబ్రహ్మాచార్య సిద్ధాంతి
నారాకోడూరు - గుంటూరుజిల్లా 522 222

ఎనభై నాలుగులక్షల జీవరాసులలో మానవుడుమాత్రమే బుద్ధిజీవి, స్వార్థజీవి, తనకు తన కుటుంబానికి, తనజాతికి, మేలు, చేకూర్చేటప్పుడు మానవుని భగవత్తుల్యునిగా నెంచుతారు.

శ్రీరంగదాసుగారు "ఆనందో బ్రహ్మ" అన్న ఉపనిషత్తు వాక్యానుసారమును గ్రహించి భద్రాచల రామదాసువలె ఆనందరూపముతో పరమాత్మ దర్శనము పొంది "శ్రీహరినామకీర్తనలు" రచించినట్లుగా తోచుచున్నది. తన ఇష్టదైవమైన భావపురి భావనారాయణస్వామితో నాటలాడి కీర్తనలు "బొమ్మలపెండ్లి వరె" ఎదురుకోలరాయబారము "తిరుమంగయాళ్వారు చరిత్రము" లిఖించినట్లున్నది అంతయు విష్ణుమయముగా అన్నమాచార్యాది భక్తవర్యులవలె ఈ రచనలు సార్థకత చెందుచున్నవి. కులమత విచక్షణారహితముగా ప్రతిమానవుడు ఆనంద సందోహములతో కీర్తనలు పాడుకొన్నచో భగవత్కరుణ పొందగలరు. నవవిధ భక్తులలో కీర్తన భక్తితత్త్వమేగదా!

నల్లూరి వంశము సకలాగమములకు వైద్యశాస్త్రములకు నిలయము. తద్వంశమందు ఎందరో మహానుభావులు గ్రంధరచనలు చేసి వైఖానస సాంప్రదాయమును వృద్ధి పొందించినారు. అట్లే నల్లూరి రంగాచార్యులుగారు_వైఖానసాగమవాచస్పతి యగు శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారు పూర్వచరిత్రాదులను రచనలను సేకరించి, ఇతోధికసేవ నొనర్చుట ముదావహము, యథాశక్తిగా రచనలచ్చొత్తింపజేసి సంఘీయులందరికి, భక్తవర్యులందరికి భగవదనుగ్రహమున వీరు మేలు చేయగలరని ఆశించుచున్నాను. అన్నమాచార్య ఆళ్వారాదులవలె నల్లూరి రంగదాసుగారు పూజనీయులు.

# ప్రశంస

సాహిత్య అచార్య
అబ్బరాజు శ్రీనివాసమూర్తి, ఎం. ఎ. బి.ఇడి. ఆంధ్రోపన్యాసకులు
తెల్లాకుల జాలయ్య, పోలిశెట్టి సోమసుందరం కళాశాల - గుంటూరు 522 006

క్షీరాబ్ధిశయనుండు నారాయణాఖ్యుడై
క్షీరవృక్షచ్ఛాయ, జెలువుసూప।
జొన్నపాతరపుట్టు వన్నెల చిన్నారి
శ్రీలక్ష్మి భావయ్య చెలిమిసేయ।
వల్మీకభవుడైన జ్వాలా నృసింహుండు
అవలంబ ముద్రిచే నార్తిబాప
నరసింహునకెదురుగా గరుడనేలేదు సామి
సౌమ్యకేశవమూర్తి సౌరుదనర।
రంగనాయకుడాండాళ్ళు రామచంద్రు
డాంజనేయుండు, సౌపర్ణు, డాళ్ళువార్లు
విఖనసాచార్య వర్యులు వెలసియున్న
దివ్య సదనమ్ము బాపట్ల దేవళమ్ము।

తర తరమ్ముల సేవించు ధన్యతములు
భక్తి "నల్లూరివారు" భావయ్య పదము
నయగుణుండు సీతారామ నాముడితడు
వంశ విఖ్యాంతి పెంచెడు పండితుండు. 2

హరిపదుడు తిరుమంగళయాళువారు
భాగవత సేవ తనరినభక్తి కవిత
పద్య పద్యమ్ము హృద్యమై పరిమళించె
"రంగ" భక్తిని "రంగడు" వ్రాయుకతన 3

తాతలు రంగాచార్యులు
చేతోమోదమ్ము జెలగ చెప్పిన కవితల్
ఖ్యాతింజెందవె। మనుమడు
సీతారామార్య బుధుడుచేసెడు కృషికిన్। 4

భావదేవుల సేవించభక్తి దనర
వలపు జిమ్మెడు కైతల వ్రాసె "రంగ"
నిత్యకైంకర్య వేళల నెగడునట్లు
వాసిగాంచరె। అర్చకస్వాములింక। 5

# అదృష్టము

డాక్టరు నారాయణం కేశవమూర్తి, యం.బి.బి.యస్ శ్రీనివాస నర్సింగ్‌హోం
ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ అర్చక కాంగ్రెస్
అధ్యక్షులు - భావపురి బ్రాహ్మణ సమాఖ్య, బాపట్ల
గవర్నింగు బాడీమెంబరు, బాపట్ల ఆర్ట్సు & సైన్సు కాలేజి, ఇంజనీరింగు కాలేజి

పరమపూజ్యులు, పెద్దలు, పండితులు, బాపట్ల శ్రీ భావనారాయణస్వామి అర్చక మిరాసిదారు అయిన కీ॥ శే॥ శ్రీ నల్లూరి రంగాచార్యస్వామివారిచే రచింపబడిన శ్రీహరినామ కీర్తనలు అను పొత్తము [రత్నత్రయము] ను వారి మనుమలు ఆగమ పండితులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అర్చక పరీక్షాధికారులు, మనకు సుపరిచితులు అయిన శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యస్వామిగారిచే ప్రచురించబడుట చాల సంతోషదాయకము మరియు భావపురి ప్రజల అదృష్టము. ఇటువంటి మహోత్కృష్టమయిన పనిని యెంతయో శ్రమతో విజయవంతముగా నిర్వహించి ఘనత పొందిన ఈ ఆచార్యులవారికి శ్రీ భావనారాయణస్వామి సర్వదా దీర్ఘ, ఆయువు, సంపద, కీర్తి, ఆరోగ్యము, సకల భోగభాగ్యములు కలుగచేయుగాత!

—o—

# ఉత్తమ చికిత్స

శ్రీ సూరి సోదరులు - (ప్రొప్రయిటర్సు)
శ్రీ భోగ లింగేశ్వర ఆయుర్వేద నిలయము – తుని తూ॥ గో॥జిల్లా
స్థాపితము - 1929

ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యులుగా, ఆగమశాస్త్ర వేత్తలుగా, కవి, పండిత, పౌరాణికులుగా, గ్రామపెద్దలుగా, పేరొందిన కీర్తిశేషులైన శ్రీమాన్ రంగాచార్యుల వారి రచనలను వారి పౌత్రులును, గౌతమ సోదరులుగా పేరందిన వేంకట రంగాచార్య, వేంకట సీతారామాచార్యులుగార్లు లోగా ప్రచురించి భక్తకోటి కందించిన విషయము జగద్విదితమైన విషయము.

నేడు శ్రీ రంగాచార్యులవారి రచనలైన, శ్రీహరినామ కీర్తనలు, ఎదురుకోల రాయబారము, తిరుమంగయాళ్వారు చరిత్రములను ఒకే గ్రంథముగా ప్రచురించి మనకందజేయు ప్రయత్నము గావించిన సీతారామాచార్యులుగారుకూడ భిషగ్వరులే. వీరి పితామహులుశారీరక రోగచికిత్సలో సిద్ధహస్తులేగాక భవరోగ భిషగ్వరులైన శ్రీ భావనారాయణస్వామివారికంకితమొనర్చుచు, భక్తలోకమునకు, అధ్యాత్మిక సందేశ పూర్వకములై మానసికానందమును చేకూర్చగల రచనలనందించి భవరోగ నివారణకై ఉత్తమ చికిత్సా ప్రక్రియ కనిపెట్టిన మహామహులు. తొంభై సంవత్సరముల తర్వాత మరల ఈ రచనలను వెలుగునకు దెచ్చి మానసికానందమును కల్గించిన శ్రీమాన్ వేంకట సీతారామాచార్యులగారికి యిట్టి సత్కార్యముల నిర్వహించగల సామర్థ్యమును ప్రసాదించవలసినదిగా శ్రీ భావదేవుని మనసారా ప్రార్థించుచున్నాము.

# భక్తిభావ భరితము

మహామండలేశ్వరి, భాగవత చరిత వ్యాస్, కళాసరస్వతి, విద్యావాచస్పతి
శ్రీరామశరణ్ (కుందుర్తి వేంకట నరసయ్య)
బుద్ధాంపోస్టు - కర్లపాలెం మండలము, గుంటూరుజిల్లా-522 111

శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు మహాభక్తాగ్రేసరులు, కవి, వాగ్గేయకారులు వారు రచించిన హరినామ సంకీర్తనలు అను గ్రంధమును నేను పూర్తిగ జదివి మహానందభరితుడనైతిని. అనేక రాగములలో వారు భావనారాయణస్వామి మీద కీర్తనలను రచించి గానమొనర్చిరి. అన్నియు భక్తిభావ భరితములై యున్నవి. వీరు కీర్తనలేగాక స్వామియొక్క పవళింపు పాటలు, తలుపుదగ్గర పాటలు, ఒప్పగింతల పాటలు కొట్నాల పాటలు, కళ్యాణములోని రాయబారము ను [ఎదురుకో] రచించిరి. అన్నిటికంటె చివరలో వారు రచించిన తిరుమంగయాళ్వారు చరిత్రమును వారు పద్యములలో రచించిరి. దానిని చదువుచుండిన అమితరసాత్మకముగ ప్రబంధ శైలిలోనున్నది. చక్కని అలంకారములతో విలసిల్లుచున్నది. మచ్చునకు ఒకటి రెండు పద్యములనిట నుటంకించుచున్నాను.

సీ॥ నీరదాభశరీరు - నిగమాంత సంచారు, ఘనమోహనాకారు భవవిదూరు,
సకలలోకాధారు సజ్జనమందారు, పరమేరు నగధీరు, వనవిహారు
శంఖచక్ర సుఖడ్గశార్ఙ్గ గదాహస్తు, నవ్యభూషణు సద్గుణ ప్రశస్తు
హారకిరీట కేయూర కుండలభూషు, శ్రీ వత్సలాంఛనాంచిత సువేషు
భక్తజనపోషు యాశ్రిత పరమతోషు, భావజవిలాసు, వైకుంఠపద నివాసు
విమలతరకీర్తి శ్రీమహావిష్ణుమూర్తి, చక్షురానందముగను బ్రత్యక్షమయ్యె.

ఈ పద్యమును చదువుచుండిన స్వామి మన యెదుట నిలుచున్నట్లే యున్నది.
ఈ పద్యము గాంచుడెంత బాగున్నదో!

సీ॥ పొదరిండ్లుగావివి పూబోణిరో చూడు, తుంటవిల్తుని బాణమంటపములు
చిగురాకులివిగావు మృగమదతిలకంబ, కంజబాణునిచేతి ఖడ్గసమితి
కంజాక్షిభృంగ ఝుంకారములివిగావు, మారుని ఇషువిలార్చి మోత
వికచాబ్జముఖి శుకపిక కూజితముగాదు, కాముని సైనిక కలకలంబు
విరులుగావివి మారునిశరచయంబు, కలికివిహరించు వనమిదిగాదు మరుడు
విటులపైదండువిడిచిన వీడుజూడు! మనముచనవ్వని విహరించునవ సరమున॥

ఈ కందంబెంత అందంగానున్నదో చూడుడు!

కం॥ వందనమిదె గైకొను గోవింద చిదానందకంద విశదము కుందా
బృందారక బృందార్చిత మందర నగధీర సుజన మాన్యవిహారా!

ఇట్టి గ్రంధమును వెలుగునకు దెచ్చిన శ్రీ వైఖానసాగమ వాచస్పతి, డాక్టరు శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులువారు వంద్యులు.

శ్రీరామశరణ్ - బుద్ధాం

# పదభక్తి

కవిశేఖర, రామాయణ కథాసుధానిధి, ఉభయ, భాషాప్రవీణ, ప్రవచనాచార్య
శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు - ఎ. టి. అగ్రహారం, గుంటూరు.

మహానుభావులు, భగవదాంతరంగికులు, పరమ ప్రపన్నులు, అయిన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యస్వామి యీ గ్రంథాన్ని రచించారు. ఆ భావదేవస్వామి యీ సారస్వత కైంకర్యాన్ని కోరి, కోరి, చేయించుకొన్నారేమో! వారిరువురికి అంత అన్యోన్యానుబంధం ఉందన్నమాట. ఆ అనుబంధం ఈ గ్రంథంలో పదపదంలోనూ ప్రతిఫలిస్తున్నది.

1. హరినామ కీర్తనలు, 2. ఎదురుకోల 3. తిరుమంగై ఆళ్వారుల చరిత్ర ఈ మూడు భాగాలుగా శ్రీ స్వామివారు రచించటంలో తత్త్వత్రయ నిష్ఠ స్పష్టంగా తెలుస్తున్నది. రెండు మాటలు కలపటంలో అత్యద్భుతంగా భక్తిని ఆవిష్కరింప జేయటంలో శ్రీ ఆచార్యస్వామి ఏ మాత్రం ప్రయత్నం చేసినట్లు కనబడదు. కాబట్టే స్వామి అనుగ్రహంతో వారు అనునిత్యంచేసే కైంకర్యమంతా రూపం ధరించినట్లు కనపడుతున్నది. ఈ గ్రంథం త్రికాల సంధ్యావందనంవలె శ్రీ మద్వైఖానస, శైవాగమ నిష్ఠాతులందరు త్రికాలములయందు చక్కగా కంఠస్తం చెయ్యాలి, అని నా మనవి.

మరో మనవి ఏమంటే ఇంత పరిణితి, నిష్కల్మషమైన భక్తి ఎక్కడా కనుపించడంలేదు. అస్తవ్యస్తంగానైనా రెండు మాటలు కూర్చేవాళ్ళే, ఎవరి పద్యాల్నో తనవిగా సభలలో చదివే వాళ్ళే, కవియని గౌరవిస్తున్న ఈ కాలంలో ఇలాంటి గ్రంథాన్ని మళ్ళీ వెలుగులోనికి తెచ్చి భక్తి సాహిత్యానికి ఎంతో పుష్టిని కూర్చారు శ్రీమాన్ సీతారామాచార్యులవారు. ఈ సీతారామాచార్యులుగారు కృతికర్త అయిన మహాకవికి పౌత్రుడు. వేంకట రామానుజాచార్యులవారికి పుత్రుడు. వీరు శ్రీ మద్వైఖానస భగవచ్ఛాస్త్రమునందు అందెవేసిన చెయ్యి! ఎంత దుర్బోధమైన విషయాన్నైనా బాలురకు చాలా సుబోధంచేసే ఉపాధ్యాయవృత్తిలో ఉన్నందువల్ల వారి హృదయం భగవత్కైంకర్యముమీద, విద్యాబోధనం మీద ఎప్పుడూ ప్రతిఫలిస్తూ ఉంటుంది. తాతగారిమీద భక్తి, సారస్వతం మీద అనురక్తి ఈ రెండూ కలసి శ్రీమన్నారాయణ సేవా పరపర్యాయంగా తలచుకోదగ్గ ఈ గ్రంథాన్ని పునర్ముద్రింపచేశాయి. శ్రీమాన్ సీతారామాచార్యులగారి ఈ సత్సంకల్పము మిక్కిలి ప్రశంసనీయము. ఆర్థికమైన వ్యయప్రయాసలకు మనస్సులో చోటివ్వకుండా, భక్తి సాహిత్యాన్ని పది మందికి అందించాలనే సదుద్దేశంతో జరిగిన యీ గ్రంథ ముద్రణమైన మనవి చేసిన అన్నింటికే తార్కాణం. వీరికి ఎంత మిత్రప్రీతివుందో నేను చవిచూచాను గాబట్టి చెప్పగలను.

గ్రంథంలోవున్న మూడు భాగాలలో హరినామకీర్తనలు, కీర్తనల రూపంలో ఉండటం విశేషం, భావ, రాగ, తాళయుక్తంగా సంస్కరణం దీప్తికి కారణం కావటం పెద్దలైన వారందరూ ఎరిగిన విషయం రెండవ, మూడవ, భాగాలలో కేవలం పద్యమయంగా భక్తిభావాన్ని ప్రకటించుకొన్నారు ఆచార్యులవారు. ఇలాంటి గ్రంథాలు మన భారతీయతకు జీవనాడులు. రచించిన రంగాచార్యులవారు, రక్షించి ప్రసిద్ధ ముద్రణ చేయించిన సీతారామాచార్యులవారు నిత్యప్రశంసార్హులు.

—o—

## కరుణామృత వృష్టి

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

శ్రీమాన్ డాక్టరు పరుచూరి రామాచార్యులు, R.M P.

ప్రధానార్చకస్వామి, శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానం - పరుచూరు, ప్రకాశంజిల్లా

చిరంజీవి సీతారామాచార్యులకు ఆశీస్సులు

మీ తాతగారును, గ్రంథకర్తయునగు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యస్వామివారు వారి ఆరాధ్యదైవమైన శ్రీ భావనారాయణస్వామివారి కరుణామృత వృష్టిలో మునిగి భావదేవాంకితము గాంచిన వారి రచనలను వెలుగునకుతెచ్చు మీ ప్రయత్నము కష్టసాధ్యమైన విషయమే. అయినను పట్టుదలతో శ్రమించి మీరు చేపట్టిన ఈ కృషిని సర్వవిద్యా ప్రదాతయైన శ్రీ లక్ష్మీహయగ్రీవమూర్తియు, సూత్రకర్తయై, భగవదారాధనాదుల ప్రబోధించిన శ్రీ విఖనసాచార్యస్వామియు, తమ కరుణారస ధారలతో ఫలింపజేయుదురుగాక.

ప్రతి వత్సరము శ్రావణ పూర్ణిమనాడు మీరు చేయుచున్న తిరు నక్షత్రోత్సవములలో పండిత సన్మానాది కార్యక్రమముతోపాటు, ఒక ఆధ్యాత్మిక గ్రంథావిష్కరణ కార్యక్రమమునుగూడ నిర్వహించగల సామర్థ్యమును మీకొసంగి మీ కులదైవమైన శ్రీమత్పొందరవల్లి రాజ్యలక్ష్మీ సమేత శ్రీ భావనారాయణస్వామి భక్తకోటిపై సదా తన కరుణామృత వృష్టి కురిపించుగాక.

—o—

# అద్వితీయము

రంగస్థల-సినీ నటులు బ్రహ్మశ్రీ ధూళిపాళ సీతారామశాస్త్రిగారు

శ్రీ మారుతి దేవాలయ సంస్థాపక అధ్యక్షులు

మారుతీనగర్, గుంటూరు - 522 006

అత్యాశలతో, అంతులేని స్వార్థంతో అధఃపాతాళానికి పరుగులు తీస్తున్న, అఖిల ప్రపంచానికి, విజ్ఞానాన్ని, శాంతిని ప్రసాదించగలిగింది ఒక్కటే. పైశాచిక ప్రవృత్తులతో, అక్రమమార్గంలో ప్రళయతాండవం చేస్తున్న మానవాళిని సక్రమమార్గంలో నడిపించి, సన్మార్గులుగా మార్చగలిగింది ఒక్కటే. అ దైవభక్తి. అందుకే భక్తిప్రచారం విరివిగా జరగాలి.

అందులోని భాగమే మహాకవులు, వైష్ణవభక్తులు కీ॥ శే॥ నల్లూరి రంగాచార్యులు వారు రచించి ప్రజాసమూహానికందించిన, శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము, శ్రీహరి నామ కీర్తనలు, ఎదురుకోల రాయబారములు ఈనాటి సమాజానికి అందులోని విశేషాలు ప్రాణప్రదాలు.

వారి మనుమలే పండిత కవులు, ఉపన్యాస కర్తలు, ఆగమశాస్త్రవేత్తలు, ఆయుర్వేద వైద్యులు శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులువారు. భక్తి ప్రచార గ్రంథాలను వెలుగులోనికి తేవడానికి వారు చేస్తున్న కృషి అద్వితీయమైనది.

అందరూ యథాశక్తి సత్కరించి సహాయ సహకారాలందించ వలసిన అవసరం ఎంతైనాఉంది. శ్రీ హనుమద్దాసు (ధూళిపాళ)

# సత్సంకల్పము

కవిరాజ్ "శిశు ప్రాణదాత" "అపర ధనంతరి"

శ్రీమాన్ డాక్టరు దీవి సుదర్శనాచార్యులు వరఫ్ నరసింహాచార్యులు

సుదర్శనాచార్యుల వైద్యశాల - బాపట్ల

బాపట్ల శ్రీ భావనారాయణుని పాదపద్మారాధకులు, గ్రంథకర్తలు ఆగమ పండితులు, వైద్యులు, పురాణ శేఖరులుగా ప్రసిద్ధిగాంచిన కీ॥ శే॥ శ్రీమాన్ నల్లూరి రంగాచార్య స్వామివారు. వీరు కవితాకన్యలను తమ

ఆరాధ్య దైవమునకంకితమొనర్చిన పుణ్యమూర్తులు. వీరి పౌత్రులైన వేంకటరంగాచార్యులు. వేంకట సీతారామాచార్యులుగార్లు తాతగారి కవితలను లోగడనే గౌతమ సోదరులుగా ముద్రించి భక్తకోటికందించియున్నారు.

ప్రస్తుతము రెండవ మనుమలైన వేంకట సీతారామాచార్యులు, తాతగారి రచనలైన శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము, ఎదురుకోల రాయబారము, శ్రీహరినామకీర్తనలు మూడింటిని ఒక గ్రంథముగా రూపొందునట్లు సత్సంకల్పముతో కృషిచేసి మనకందించినారు. ఈ క్షేత్రాధినాథుడై చతుర్దశ శతవర్షములనుండి [1400 సంవత్సరములు] భావపురి వాసులను కాపాడుచున్న శ్రీమత్సుందర వల్లీ రాజ్యలక్ష్మీ సమేత శ్రీభావనారాయణ స్వామి సదా, సర్వదా, సర్వాభీష్టసిద్ధినొసగి సర్వులను సంరక్షించుగాక.

తథాస్తు

## పరమ పవిత్రులు

శ్రీ బొలినేని లక్ష్మయ్యగారు గ్రేడ్ I హిందీ పండితులు
సెయింట్ తెరీసా ఉన్నత పాఠశాల ఒంగోలు - ప్రకాశం జిల్లా

శ్రీభావనారాయణస్వామివారి అంతరంగికులు, ఆయుర్వేదవైద్యులు ఆగమవేత్తలు, ప్రసిద్ధపౌరాణికులు అయిన కీ॥శే॥ వల్లూరి రంగాచార్యులుగారు తమ కవితాకన్యలను శ్రీ శ్రీ భావదేవున కర్పించిన పరమపవిత్రులు.

వారి పౌత్రులు శ్రీ రంగాచార్యులవారి కృతులలో శ్రీ తిరుమంగయాళ్వార్ చరిత్రము శ్రీహరి నామకీర్తనలను ఎదురుకోల రాయబారము మూడింటిని త్రికరణశుద్ధిగా శ్రమించి ప్రచురించి మనకందించుట ముదావహమైన విషయము మిగిలిన కృతులను కూడా శ్రమించి భక్తకోటి కందజేయ గల శక్తి సామర్థ్యములను వారి కందజేయవలసినదిగా కల్పవృక్ష సదృశులైన శ్రీ భావదేవుని మనసారా ప్రార్థించుచున్నాను॥

హిందీభాషలో రామచరిత మానసమును రచించిన తులసీదాసస్వామివారివలనే వీరును ఆంధ్రభాషలో భక్తిరస గ్రంథములు రచించిన మహనీయులే శ్రీ రంగదాసస్వామివారు. సర్వాంతర్యామియైన శ్రీ భావదేవుడు సర్వులకు, సర్వాభీష్టముల నిచ్చి కాచుగాక.

# భక్తి తరంగిణి

శ్రీమాన్ డాక్టరు కె. వి. సత్యనారాయణాచార్యులు
హింది భాషాశాఖాధిపతి
ది బాపట్ల కాలేజి ఆర్ట్సు అండ్ సైన్సెస్, బాపట్ల
కార్యదర్శి కళాభారతి, బాపట్ల.

శ్రీ భావదేవుని చరణారవిందముల సంసేవనంలో పునీతులైన పూజ్యపాదులు కీ॥శే॥ నల్లూరి రంగాచార్యస్వామివారు. అర్చకాగ్రేసరులైన వారి అంతరంగంనుండి ప్రభవించిన యీ భక్తితరంగిణి స్తోత్ర వాఙ్మయంలో ఒక త్రివేణి.

అచంచలమైన భక్తిభావము, అద్వితీయమైన రచనా విన్యాసము, అపురూపమైన సంగీత పరిజ్ఞానము యీపుస్తకానికి వన్నెను, వాసిని సమకూర్చాయి. లలితమైన శబ్దాలతో, రమణీయమైన శైలితో, అనువైన రాగంతో శ్రీరంగాచార్యస్వామి రచించిన ప్రతి కీర్తన శారదాదేవి చరణ సన్నిధిలో ఒక సురుచిరమైన సుమార్చన.

ఈ హరినామ కీర్తనలు భక్తుల హృదయాలకు వెన్నెల విరిజల్లులు! ముముక్షువులైన ఆధ్యాత్మిక చింతనాతత్పరులకు సర్వేశ్వరుని స్వరూపాన్ని సాక్షాత్కరింపజేసే అక్షరాల హరివిల్లులు. కేవలం హృద్యమైన గేయ రచనలోనేగాక, చందోబద్ధమైన పద్య రచనలోకూడా శ్రీ రంగాచార్యుల వారి ప్రతిభ ప్రశంసనీయము.

భక్తిభావం కొఱవడుతున్న ప్రస్తుత సమయంలో తాతగారి యీ కృతిని పునర్ముద్రించి, వసివాడుతున్న భక్తి లతకు మిసిమినొసగే మారాకు తొడగటానికి ప్రయత్నించిన ఆగమాచార్యులు, అష్టవిద్యాభూషణులు ఉత్తమ ఉపదేశికులు, ఆయుర్వేదవైద్య శేఖరులు శ్రీమాన్ నల్లూరి వెంకట సీతారామాచార్యులవారు సర్వదా, సర్వథా సంస్తవనీయులు.

# ప్రభంజనం

జాతీయ స్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత,
ప్రభుత్వ పాఠ్య పుస్తక రచయిత
శ్రీమాన్ దీవి రంగాచార్యులు M.A. B.ed.,—స్వర్ణ -523 170

నల్లూరి సంగీత సాహితీరంగం!
మల్లెల రంగాచార్య కవితాతరంగం!!
ఇవి భావదేవుని లీలా సంకీర్తనలు
ఇలలో పదిలమైన ముక్తిభావనలు
ఆచార్యులవారి భక్తితత్వరాగాలు
అందిన అమూల్య సాహితీతోరణాలు!
ఎదురుకోల మహోత్సవ సాహితి
ముదముగూర్చెడి పూర్వ విజ్ఞానప్రగతి
భక్తిభావాలకిది చక్కనివారధి
శక్తికలిగిన దృశ్యకావ్య సన్నిధి!
భాగవతుల సేవా తత్వపరాయణం
ప్రవిమల భక్తుల ముక్తిపథ నిరూపణం
పరకాలుని శరణాగతికిది దర్పణం
తిరుమంగయాళ్వారు విశిష్టకథాకథనం!
నల్లూరి సద్వంశ విజ్ఞానవీచికల తేజస్వి
మల్లెమనసుల సీతారామాచార్య మనస్వి
తాతపాదుల కవితకందించె నీరాజనం
తరగనిదాభక్తి సాహితీ ప్రభంజనం
స్వర్ణ శ్రీవల్లభస్వామి కృపారసాలు
శ్రీవిఖనసాచార్య పూజాఫలాలు
అందాలి! ఆచార్యుల వారికి సతతం
అందుకోవాలి! శుభాకాంక్షలనునిత్యం!

శుభం భూయాత్

డా॥ దీవి రామమాచార్యులు, ఆర్.యం.పి. హోమియో - స్వర్ణ.

# సోపాన త్రయము

శ్రీమాన్ వేదాన్తం లక్ష్మీకుమార శ్రీ వరదసుందరరాజభట్టాచార్యులు
M. A.
"భాషాప్రవీణ" "రాష్ట్రభాషాప్రవీణ"
తెలుగు పండితులు శ్రీ రావి సాంబయ్య మున్సిపల్ హైస్కూలు,
కొత్తపేట, తెనాలి.

పూజ్యులు, కార్యసాధనా వ్యవహారదక్షులు ఆగమ ప్రవర, వైఖానసాగమవాచస్పతి, వైఖానసాగమరత్నాకర, ఆర్షవిద్యాభూషణ, బిరుదాంకితులు, మత్ప్రియసమానులు, శ్రీమాన్ నల్లూరి వేంకట సీతా రామాచార్యులవారిచే ప్రచురింపబడు నీగ్రంథము అర్చక లోకమునకు ఆనందదాయకము కాగలదు. గ్రంథకర్తలు శ్రీమాన్ నల్లూరి రంగా చార్యులవారు శ్రీ బాపట్ల భావనారాయణస్వామివారి పాదపద్మారాధకులు పౌరాణిక శేఖరులు, భిషగ్రత్న, కవీశ్వర, అగమాచార్య బిరుదాంకితులు శ్రీ వైఖానసకులాలంకారులు మాతాతపాదులగుట ఎంతయోముదావహము గర్వకారణము.

ఈగ్రంథమునందలి శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము, 2. శ్రీహరి నామకీర్తనలు, 3. ఎదురుకోలరాయబారము, అను చక్కెర పలుకలను మధురభక్తియను మధువుతోనాన్చి మనకందించబడినవి. ఈరత్న త్రయము ఈషణత్రయవినిర్ముక్తికి సోపానత్రయమై విరాజిల్లుచున్నది.

శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రముచే స్వామి సన్నిధానమున కేగునట్టి పరమైకాంతులకుకూడా దక్కని పరమపదమును సాధింపగల భక్తిని ప్రసాదించుటే ఈగ్రంథములోని సదుద్దేశ్యము, శ్రీహరి నామ కీర్తనల యందు భక్తిని కలిగించి ఎదురుకోల రాయబారములో సందేహములను ఊడ్చి మనస్సు ఏకాగ్రమును సాధించు ప్రయత్నమే వీటి సారాంశమని నాభావన.

శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్ర కావ్యలక్షణములుకలిగి చక్కని గ్రంథముగా విరాజిల్లుచున్నది, " ఇవ్విధంబున నక్కమలాకరంబున్

ప్రవేశించి" అన్న వచనము గజేంద్రమోక్షణఘట్టములోని "అదిమరియును మాతులుంగ" అను అటవీ వర్ణనను స్ఫురింపజేయుచున్నది.

నీలుడు మదనబాణ పీడితుడైన సందర్భమున పలికిన మత్తకోకిల పద్యము "సుందరాంగిరో నిన్ను వేడుక చూచినంతటినుండి నా" అన్న కవిగారి సమయోచిత పాండితీ పటిమను తలపించుచున్నది. నీల, భూవరుల యుద్ధసమయమున రచింపబడిన పంచచామరము, నీలుడు ప్రాణపరిత్యాగము చేయ నిశ్చయించిన సమయమున దండకమును రచించుట కవిగారి ఉచితజ్ఞతకు ఉదాహరణము.

శ్రీ మహావిష్ణుమూర్తి ప్రత్యక్షమైన సమయమున రచింపబడిన వచనము శ్రీనాథ పోతనలు, నన్నయ చిన్నయల వచనరచనలకు ఏమాత్రము తీసిపోదనియూ అనుప్రాసాలంకారయుక్తమై యున్నదని నా అభిప్రాయము. "పట్టెనామంబులు దిట్టముగాబెట్టి ఇట్టిట్టులాడుచూ మిట్టిపడుచూ" అన్న సీసపద్యము స్వభావోక్త్యలంకార బంధురమైయున్నది.

"వందమిదెగైకొను గోవింద చిదానందకంద విశదముకుంద" అన్న పద్యము ఛేకానుప్రాసాలంకారముతో గూడి చక్కని విష్ణుపదసేవాసక్తిని, భక్తిని చాటుచున్నది.

"పొదరిండ్లగావివి పూబోణిరో చూడు-తుంటవిల్తునిబాణ మంటపములు" అన్న సీసపద్యము అపహ్నుతి అలంకారయుక్తమై కావ్యమునకు వన్నె తెచ్చుచున్నది.

"నీరదాభశరీరు నిగమాంత సంచారు-నవమోహనాకారు భవవిదూరు" అన్న సీసపద్యము ధారాశుద్ధికి, పదముల కూర్పుకు దృష్టాంతము,

మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని అన్నట్లు ఆది మధ్యాంతములయందు మంగళశ్లోకములుకలవు. గ్రంథాదియందు నాలుగైదు కంద పద్యములతో కృతికర్త వంశవర్ణనముకలదు.

"శ్రీ బాలామణి మానసోత్పల శరత్ శ్శీతాంశు బింబాననా" అన్న అశ్వాసాంత శార్దూలపద్యమునందు పోతనామాత్యునివలె మనుజేశ్వరాధములకు కృతి నీయక శ్రీ భావనారాయణస్వామివారికే నీకావ్యమును

అంతకిమిచ్చినట్లు (కృతిపతిగా చేసినట్లు) తెలియుచున్నది. మొత్తమువిూద ఏకాశ్వాసముకలిగిననూ ప్రబంధ లక్షణములన్నియుగలిగి ఉత్తమ ప్రబంధ మనదగి ఐహికాముష్మిక సుఖములనొనగూర్చుట కర్హమైయున్నది.

శ్రీహరి నామకీర్తనలలో భక్తిభావము నిండినిబిడీ కృతమైయున్నది. "భజరే శ్రీకృష్ణం - హేమానస భజరే శ్రీకృష్ణం" అన్న శంకరాభరణ కీర్తన జయదేవుని అష్టపదులను తలపుకుతెచ్చుచున్నది. "జోరణ్యగుణధామ జోదనుజభీమ - జోనీరదశ్యామ జోభవవిరామ" "జోజో" అన్న పాట సాహిత్యము నందనోద్యానమున విరగబూసిన విరజాజి. ప్రసిద్ధికెక్కిన లాలిపాటలోని లాలిత్యమును పలకబోయుచున్నది.

తలుపుదగ్గర పాట తెలుగింటి అడపడుచుల ప్రౌఢత్వమును తెలుగువారి ఆచారములను వారి భావనామాధుర్యములను రసికతను చాటుచున్నది! కొట్నాలు పాటలోని 'సువ్వి సువ్వి సువ్వియని సుదతులెల్లరుపాడరె" అను పాటలోని తెలుగుదనము ఉట్టిపడుచున్నది.

అప్పగింతలపాటలో "అత్తమామలయందు అతిభక్తిగలిగి వర్తించు మాయమ్మ వాసిమీరగను" అనుచోట కాళిదాస విరచిత అభిజ్ఞాన శాకుంతలములోని "శుశ్రూషస్వ గురూన్ కురు" శ్లోక చతుష్టయములోని శ్లోక భావమును, తాళ్ళపాక అన్నమాచార్యులవారి గృహిణి, తిమ్మక్కగారి సుభద్రాపరిణయములోని ద్విపదనుకూడా గుర్తుతెచ్చుచున్నది.

మెదురుకోల రాయబారము గద్య పద్యాత్మక చంపూ నాటక ధోరణిలోనడచి చమత్కార జనకమైయున్నది.

పై గ్రంథ రత్న త్రయము భక్తకోటికి దారేషణ, పుత్రేషణ, ధనేషణలనెడి ఈషణత్రయ ముక్తికి సోపానత్రయమై విరాజిల్లి భగవదను గ్రహప్రాప్తి నందించుగాక.



## వాగ్గేయ కారులు

శ్రీమాన్ పండిత రొంపిచర్ల భట్టర్ శ్రీనివాసాచార్యులుగారు
ఎం.ఎ. (సంస్కృతం) భాషాప్రవీణ (తెలుగు) భాష్యాన్త వైయాకరణులు
సంస్కృతాష్టావధాని, కొవ్వూరు ప.గో.జిల్లా.

శ్రీమదిత్యాది శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారు రచించిన శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము, శ్రీహరినామకీర్తనలు, ఎదురుకోల రాయబారము, కోట్నాలపాటలు, తలుపుదగ్గరపాటలు, వప్పగింతపాటలతో కూడిన ముద్రిత ప్రతి మృదు మధుర పదరచనచే మోదావహమైయున్నది. భగవద్భక్తి వెల్లివిరియు హరినామ సంకీర్తనలు గ్రంథకర్తయొక్క పరమభాగవత తత్త్వమును చాటుచున్నవనుట పునరుక్తియేయగును. మరియు రచయిత వాగ్గేయకారులని వేరుగ వచింపబనిలేదు. కోట్నాలపాటలు, తలుపు దగ్గరపాటలు, వప్పగింతపాట నేటి యువతరమునకు ప్రాచీన నాగరికతను గుర్తుకు తెచ్చుచున్నది

శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము చక్కని రచనా విశేషముతో భాగవతతత్త్వమును విశదమొనర్చుచున్నది. సాంప్రదాయకమగు ఎదురుకోలరాయబారము దేవాలయములలో ఉత్సవములకువచ్చు భగవద్భక్తులను త్సాహపరచుట కెంతేనియుపకరించుచున్నది.

శ్రీ భావనారాయణస్వామివారి సేవాభాగ్య పరిపాకమే గ్రన్థరచయిత రచనా విశేషమనుట నిస్సంశయము. ఇట్టి పవిత్ర రచనను వెలుగునకు తెచ్చిన శ్రీమాన్ నల్లూరి వెంకట సీతారామాచార్యులుగారు తమతాతగారి యందలి భక్తిభావమును వెల్లడించుటతో పాటు భక్తాళికి మహానందమును సంతరించి ధన్యులైరనుట నిశ్చప్రశము.

## ప్ర సి త ము

"వాస్తుజ్యోతిషాలంకార" 'జ్యోతిషకంఠీరవ' 'దైవజ్ఞరత్న"
శ్రీ రామకవచం వేంకటేశ్వరశర్మ విజయలక్ష్మీపురం, బాపట్ల.

శ్రీ వైఖానసాగమ శాస్త్ర నిష్ణాతులు, మిత్రులు శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులుగారు తాము ముద్రిస్తున్న శ్రీతిరుమంగ యాళ్వారు చరిత్రమును అందించినారు. యిందులో మూడు విభాగము లున్నవి. రచించినవారు శ్రీ రంగ ధామ మను నను గ్రహముచే జనించి

శ్రీ భావదేవు నారాధించి తరించిన మహాత్ములు రంగాచార్యులవారు.

ప్రథమ విభాగము శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము:- కథా సంవిధానమే విచిత్రము, దివ్యాప్సరసకన్య కుముదవల్లి యెచట? మేచ్ఛ వంశజుడైన నీలుడు యెచట? వీరి దాంపత్యమే మహా విచిత్రముగా మారడము, శ్రీరంగనిపై భక్తి కలగడం, వైఖానస, వైష్ణవ భక్త బృందములను సేవించి, సేవించి, విష్ణుమూర్త్యనుగ్రహామునుపొందిన నీలుడు తుదకు బ్రహ్మణ్యుడే అయిన విధానము చెప్పుకోతగినది.

శ్లో॥ శూద్రోపి శీలసంపన్నో గుణవాన్ బ్రహ్మణోభవేత్।
బ్రాహ్మణోపి క్రియాహీనః శూద్రాత్ప్రత్యవరోభవేత్॥

అన్న మనువాక్యమును తలపింపజేస్తున్నది. శీలసంపద ప్రభావమును ఆనాటిపెద్దలే ప్రవచించినారు. యిది తెలియని యీనాటివారు కొందరు ప్రాచీనులను కుల మతాల పేరుతో విమర్శించడం వారి అవజ్ఞతను తెలుపును. నీలుడు పరకాలుడుగామారి శ్రీరంగక్షేత్ర దేవగృహాది నగర నిర్మాణ ప్రథముడయినాడు, యెంతగానో చెప్పుకోదగిన విషయము చరిత్ర కు నిదర్శనము. ఇదంతా కుముదవల్లి చలువ సంకల్పబలము. "స్త్రీణాంచ చిత్తం పురుషస్య భాగ్యం" అన్నారు పెద్దలు. ఇట్టికుముదవల్లీ పరకాలుల చరిత్రను శ్రీరంగధాముని చరిత్రనువివరించిన శ్రీ నల్లూరి రంగాచార్యవంశచరిత్రమే పునీతము.

ద్వితీయవిభాగము. శ్రీహరినామకీర్తనలు యెంతోకమ్మని సాహిత్య పదప్రయోగ ప్రతిభా, పరిపూర్ణమైన సంగీతసాహిత్య రాగతాళాది శాస్త్రాభి నివేశము ధారాప్రవాహముగా జాలువారినది. వారి అంతరంగిక భక్తి ప్రపత్తులు రచనలో చక్కగా దర్శనమిస్తున్నవి. యెన్నో చాతుర్యవంతము లయిన సంకీర్తనలున్నవి. మెచ్చినవారెందరైనావుంటారు. ఈనాటి మనము వారి సమానులము కాలేముకూడా.

తృతీయ విభాగము. యెదురుకోలురాయబారము. రచన మనోహరమైన వివాహతంతు యెంతో మచ్చటగాయున్నది. జనక- దశరధమహారాజుతే

ఎదురుకోల నాధారము గా నేటికి మన వివాహ కార్యక్రమాలలో ఎదురుకోలురాయబారములు జరుగుచున్నవి. చక్కగావర్ణించి రచించినందున పాఠకులకుల్లాసముకలిగిస్తున్నది. ఈరచనలో రామాయణమే సాక్షాత్కరించి జన పావనము చేస్తున్నది. ఎదురుకోల వేడుకలు, పుష్పాదులు చల్లుట, పరస్పర సంభాషణములు రసవంతములుగా మారడం కనిపించ గలదు. పాఠకుడు తానూ ఆఎదురుకోలలోవున్న భ్రాంత్యానందము కలిగిస్తున్నది రచనాశైలి యెంతోచక్కగానున్నది.

ప్రచురించిన, వెలికితెచ్చిన శ్రీమాన్ నల్లూరి వేంకటసీతారామా చార్యు లెంతటిధన్యులోచెప్పలేము. వీరికి సదా శ్రీరంగ రాజానుగ్రహ వీక్షణములు కలుగుగాక.

—) ० —(

శ్రియైనమః శ్రీ భావదేవాయనమః శ్రీ విఖనస దేశికేంద్రాయ నమః

## సద్గ్రంధ సౌరభము

సుజన విధేయుడు, పౌరాణిక శిరోమణి

శ్రీ శ్రీమాన్ నారాయణం వేంకట రామాచార్యులు

శ్రీ భావనారాయణస్వామి దేవస్థానంప్రధానార్చకులు పొన్నూరు

శ్రీ భావదేవ చరణ స్మరణానంద కందళిత హృదయారవిందులు, ప్రసన్న శేఖరులు, శ్రీ గౌతమ వంశాబ్ధిచంద్రులు, శ్రీ వైఖానస కుల తిలకులు, పూజ్యపాదులు, యశశ్శరీరులగు శ్రీమాన్ పండిత నల్లూరి రంగాచార్యుల వారిచే రచింపబడిన ఏకాశ్యాస గ్రంధ రచనావలోకనముచే శ్రీ ఆచార్యులవారి కవిత్వ పటుత్వములకు పరవశుడనై శ్రీభావ దేవాజ్ఞతో వందన పూర్వక అభినందన మొనర్చుచూనిటిని.

శ్రీ శారదాజననీ స్తన్యద్వయ పానాభివర్ధిష్ణులు శ్రీ ఆచార్యవర్యులు కనుకనే సంగీత సాహిత్య విజ్ఞాన నిధులైరి. శ్రీహరినామ సంకీర్తనలయందు వీరు కనబరచిన వేదాంత సూక్తులు పాఠకులకు జ్ఞాన ప్రకాశకములు. భక్తి భావోద్దీపకములు. వైరాగ్య బోధకములు.

వీరి రచన భక్తిభావమున భక్తపోతన రచనకు ప్రతిబింబము తిరుమంగకుని చరిత్రలో పరకాలుడు శ్రీ రంగనాథ రమానాథ......అను దండకస్తుతి. ప్రత్యక్షమైన భర్తవరదుని స్వరూప ధ్యాన సీస పద్యము మచ్చు తునకలు, తలుపుదగ్గరపాట, కొట్నాలపాట, వీరి శృంగార రచనకు ప్రతీకలు-సంగీతవిద్యా పాటవమునకు గీటురాళ్ళు.

ఆచార్యులవారు మృదుమధురముగా, భావసౌలభ్యముగా, నవరస భరితముగా, ఛందోబద్ధముగా తమ రచన సాగించిరి. కవిసార్వభౌమునిగా నేను గుర్తించి స్తుతించుచున్నాను. కవితా శిల్పముతో ఆచార్యులవారు సృష్టించిన సద్గ్రంథములు కాలగర్భములో లీనము కాకుండా వీరియందున్న భక్తి గౌరవములతో మనుమడు డాక్టరు నల్లూరి వేంకట సీతారామా చార్యులుగారు వ్యయ ప్రయాసలకోర్చి పునః పునర్ముద్రణలు చేయుట ముదావహము. భగవద్భక్తికి నిదర్శనము.

వీరికి శ్రీ భావదేవుడు ఇతోధికాయురారోగ్యైశ్వర్యాదులనొసంగి పరి రక్షించుగాక యని, శ్రీ ఆచార్యుల వారి రచనలు ఆచంద్ర తారార్కము వర్ధిల్లుగాక యని మా ప్రార్థనము. ఈ సదవకాశమిచ్చినందుకు వారికి నేను కృతజ్ఞుడను.

## అమృత హస్తులు

డాక్టరు వేదాంతం రామకృష్ణమాచార్యులుగారు
అధ్యక్షులు
శ్రీ వైఖానస సమహామండలి - వైఖానస గౌతమ యోగానందాశ్రమము
వైద్యసేవాసదనము గాంధినగరం - విజయవాడ 520 003

శ్రీమాన్ నల్లూరి వేంకట సీతారామాచార్యులవారికి నమస్సుమాంజలి.

మీరు ప్రేమతో పంపిన శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము ఆమూలాగ్ర ముగా చూచితిని. మీ తాతగారైన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు ఆగమశాస్త్ర ప్రవీణులేగాక కవిపండితులు కూడాను వారి పాండితీప్రతిభ, మృదుమధురమైన కవిత్వశైలి శ్లాఘనీయము. అంతేగాక వారు వైద్యంలో అమృతహస్తులని చరిత్ర చెప్పుచున్నవి.

ఇక తిరుమంగయి ళ్వారు చరిత్ర రచనలో కవి చాతుర్యము గోచరమగుచున్నది. భక్తితో భాగవత సేవను కనులకు కట్టినట్లుగా చూపించినారు.

'శ్రీహరినామకీర్తనలు" సులభశైలిలోనుండి అందరికి గానముచేయుట కనువుగా, మృదుమధురమై, రాగయుక్తముగాను, భావయుక్తముగా నుండి సంగీత సాహిత్యాభిమానుల ప్రశంసలందుకొనుచున్నది.

"ఎదురుకోలరాయబారము" భావగంభీరముగాసాగి, శ్రీస్వామివారి కళ్యాణోత్సవములలో దీనినిమనము ప్రయోగించవలెననే ఉత్సుకతను ప్రతి వారికిని కలిగించుచున్నది,

వైద్యశిఖామణి, ఆగమ కిశోరము, దైవజ్ఞ, కవి, పండితులైన కీ॥శే॥ శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారి రచనలనుతెలుగులోనికి తెచ్చి పితామహుల కీర్తిచంద్రికలను దిగ్ దిగంతములకు వ్యాపింపచేయవలెననే ప్రయత్నముతో శ్రీమాన్ వేంకటసీతారామాచార్యులగారు కృతకృత్యులైనారని భావిస్తూ వారికృషికి అమృతహస్తులైన శ్రీభావనారాయణస్వామి వారు ఆశీస్సులందించాలని మాకోరిక.

## పూజ్యమూర్తి

శ్రీమాన్ పండిత డాక్టరు బృందావనం శ్రీనివాసాచార్యులుగారు

గూడవల్లి, రేపల్లె తాలూకా, గుంటూరుజిల్లా, ఆం.ప్ర.

మా బావగారైన శ్రీమాన్ నల్లూరి వేంకటసీతారామాచార్యులుగారు పంపిన ఈగ్రంధమునుచూచి,చదివి, విని, వినిపించి అందరము ఆనందించినాము సహజపాండిత్య ప్రతిభాశాలియైన వీరి తాతగారు మాతండ్రిగారైన పండిత బృందావనం నారాయణాచార్యులుగారి మేనమామలు. వీరు శ్రీభావనారాయణ స్వామివారి పాద పద్మారాధనలో మునిగియున్నను భగవదనుగ్రహముచే లభించిన కవితను భగవదర్పణగావించి ధన్యులైనపూజ్యులు మాధవసేవయే గాక మానవసేవలో అపర ధన్వంతరిగా ఆప్తుడుగా, మిత్రుడుగా, దాతగా గ్రంధకర్తగా, గ్రామపెద్దగా పేరెన్నికగని అనేకమంది శిష్యులకు గురువుగా ప్రకాశించినారు.

తమకు దొరికిన తీరిక సమయములో అనేకవిధములైన భక్తిభావ రసభరితములైన కవితాకన్యలకు జన్మనిచ్చిన పుణ్యమూర్తి.

శ్రీ ఆచార్యులవారి పౌత్రులైన శ్రీమాన్ వేంకటరంగాచార్యులవారు వేంకటసీతారామాచార్యులవారు లోగడనే తాతగారి గ్రంథములకు అక్షర రూపము కలిగించి భక్తులకందజేసియున్నారు. గౌతమ సోదరులలో పెద్దవారైన శ్రీ వేంకటరంగాచార్యులవారు నాకు పిల్లనిచ్చిన మామగారు చినమామగారైన శ్రీ వేంకట సీతారామాచార్యులవారు ఈ గ్రంథ ముద్రణకై అనేక శ్రమలకోర్చి తీర్చిదిద్ది సర్వాంగసుందరముగా అందించి మహదానందము కలిగించినారు. లోగడ గౌతమ సోదరులుగా ప్రచురించిన గ్రంథములు అలభ్యమైనందున వాటిని తిరిగి పునర్ముద్రించి అందించ వలసినదిగా శ్రీ సీతారామాచార్యులవారిని కోరుచు, వలయు ఆర్థిక, శారీరక సహకారమునందజేయుటకు భక్తకోటి సిద్ధముగా యున్నదని తెలుపుకొను చున్నాను, వీరికి మా ఆరాధ్యదైవమైన శ్రీలక్ష్మీనరసింహస్వామి, మీ ఆరాధ్యదైవమైన శ్రీ భావదేవులు సర్వదా ఆయురారోగ్యైశ్వర్య భోగ భాగ్యములనిచ్చి సంకల్పసిద్ధి నందింతురుగాక.

శ్రీ రాజ్యలక్ష్మిః శ్రీ భావదేవః



శ్రీ లక్ష్మీహయగ్రీవ : శ్రీ భగవాన్ విఖనాః

శ్రీ వీర, భోగ, యోగ లక్ష్మీ సమేత

శ్రీ జ్వాలా నరసింహస్వామివారు - బావట్ల



శ్రీమన్నృసింహ విభవే గరుడ ధ్వజాయ
తాపత్రయోప శమనాయ భవౌషధాయ
తృష్ణా దివృశ్చికజలాగ్ని భుజంగరోగ క్లేశవ్యయాయ
హరయే గురవే నమస్తే నమస్తే నమః

మంగళా శాసనపరైః మదాచార్య పురోగమైః
సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్

ఓమ్ తత్ సత్

శ్రీ తిరుమంగయాళ్వారు చరిత్రము        మూల్యము : రు. 15-00



శ్రీ భావనారాయణస్వామివారి గాలిగోపురం - బాపట్ల

శ్రీ లక్ష్మీ ప్రెస్ - బాపట్ల